ఓం

శ్రీ సద్గురుభ్యో నమః

# ఆనందవనము.

(కైతలు)



యనమండ్ర సాంబశివరావు,

# మనవి.

'ఆనంద వనము' తొమ్మిది కథల సంపుటి. ఇందు 'ప్రేమ సూత్రము'ను దాని కథావస్తువు (theme) [illegible] మహా కవిదగు " where Love is, God is" అను దానికి సంబంధించినది. దీనికి స్వతంత్రభావముల గల్పించి విపులీకరించితిని. ఒకటి రెండు దృశ్యములు మాత్రము మూలమునకు పోలికగానుండగలవు. ఆర్. సి. ట్రెవిల్యానుగారు వ్రాసిన " The pearl-Tree" లోని ముఖ్యాంశమును క్లుప్తముగ ముచ్చటింపుచు టి. యల్. వాస్వానిగారు వ్రాసిన చిన్నవిషయమును చదివి, యుత్సాహపడి 'ప్రేమగానము' ను స్వతంత్రముగ నల్లితిని. ట్రెవిల్యానుగారి గ్రంథమును నేను చదువలేదు. ఉత్కృష్టభావములనూ ఉన్నతాశయములనూ పురికొల్పు విషయము లన్యభాషవైనను, వాటిని వెల్లడిజేసిన మేలేకల్గునని యూహించి యత్నొనర్చితిని. మోలియరు నాటకము నొకదాని నాధారముజేసుకుని, కొన్నిమార్పులతో 'సుబ్బన్నపెళ్లి' వ్రాసియున్నాను. ఇది దాని యనుకరణ మనవచ్చును. 'మావ్యాఘ్రము' నేవ్యక్తినీ యుద్దేసించి వ్రాసినదికాదు.

అప్పటప్పట నాకథలను ప్రచురించి నన్ను ప్రోత్సాహముం జేసిన 'భారతి' 'ఆంధ్రపత్రిక' 'చంద్రిక' పత్రికలకు నాకృతజ్ఞతాభివందనములు.

ఈ పుస్తకము నాప్రథమప్రయత్నమై యున్నది. కొన్ని కారణములచేత నిందు లోపములుండవచ్చును. చదువరులు మన్నింతురుగాక.

2 3. 2. 38 యం. సా.

# విషయసూచిక.



# ప్రేమసూత్రము.



గోడారి గుంపదాసు పట్నంలో పేరుమోసిన మనిషి. కులవృత్తి అయిన జోళ్లు కుట్టడంలో ఊరి మొత్తాన తనదే భారీపని, ఊరిమొగని పెద్దచెరువు దిబ్బమీద రోడ్డుకానుకునే, ఓ పెద్ద మర్రిచెట్టు చాటున చిన్నగుడిసెలో తనకాపరం, వ్యాపారంనూ. భార్య ఆదెమ్మ, సోదె, చేటబియ్యం, పతి, చెప్పతూ, ఊళ్లో జడుపు, జాడ్యాలకీ, పురుడూ పుణ్యాలకీ మందూ మాకులకీ అని చెప్పి కుంకాలిస్తూ, గోవిందరాజులు దేవుణ్ణి పూనిస్తూ, సాంప్రదాయాన్ని చెరపకుండా, డబ్బుచ్చుకోకుండా జనానికి సహాయం చేస్తూ దాసుతో సుమారు నలభై ఏళ్లు కాపరం చేసి పుణ్యలోకం చేరింది. గుంపదాసుకి ఆ ఊరి ఆసామీలంతా పరిచయులే. జోడు వేసుకోని అతని గుడిసె మొగ దాటి నడచిన మనుష్యులని కిటికీలోంచి చూసి, ఆజోడుఆనమాలున ఫలానా రామయ్య, ఫలానా వెంకునాయుడు, ఫలానా జవాన్ అబ్దుల్లా, ఇత్యాదిగా టకీమాని పోల్చిపట్టేసేవాడు; కారణం వాళ్ల జోళ్లకి ఎప్పుడో అప్పుడు ఆతనే మణమలు కుట్టిందీ, ముక్కలు వేసిందీ, కుట్లు కుట్టిందీ, మేకులు గుద్దిందీని. పనివాడనీ, నిజాయతీ మనిషనీ, అనుకున్ననాటికి పని వొప్పగించకలడనీ, అవసరం అయితే ఇంకోరోజు గడువు ఎక్కువ అడి

---

*నవంబరు 17, '37 ఆంధ్రవారపత్రికయందు ముద్రింపబడినది.

గై నాపరే చెప్పినరోజుకి జోళ్లుతయారుచేస్తాడనీ ఇతనికే పని ఇ
చ్చేవారంతా.

* * *

చదువులేనివాడైనా గుంపదాసు గొప్పభక్తుడు. చిన్న
ప్పటినుంచీ "భగవంతుడ"నే మాట తానుజేసిన స్వల్పవిష
యాల్లోకూడా ఉపయోగించుతుండేవాడుట. వృద్ధాప్యం దాప
రించిన నుంచీ అతనిలో ఒకవిధమైన ఆధ్యాత్మిక వికాసం కలగ
డం ఆరంభించగానే, కొంత వైరాగ్యం, జ్ఞానం, మొలకలెత్తే
యి. యీ ప్రపంచంగురించీ, సృష్టిలో వ్యక్తులగురించీ, దైవ
ముగురించి తనలో తాను విమర్శనచేసుకుంటున్నకొద్దీ అంతా
అగాధం, అయోమయంగా కనుపించేది. గురూపదేశం కోరుచు
న్న మనసు, సాఫల్యం పొందలేక తహతహలాడింది. సంశయా
లు హెచ్చైనకొద్దీ మనస్థయిర్యం చలింపడం ఆరంభించింది. సా
ధన లభించిందనుకుంటే అభిప్రాయభేదాలు సూచించి మనిషిని
హడావిడిపెట్టేయి. దీనికంతకీ ఓకారణం, తానేమో భగవద్ద
ర్శనం చెయ్యాలనే సంకల్పం, వాంఛా, ఉండడంచేతనే. అత డే
రూపమున దర్శనమిస్తాడో, లేక, ఇదివరకే ఇచ్చివున్నాడోకూ
డా తెలియక పరిపరివిధాల భ్రమలోంచి సత్యానికీ, సత్యంలోం
చి భ్రమలోకీ దొర్లిగిల్లుతున్నాడు. యీవికృతం ఎలాగ సుకృ
తంగా మారుతుందో చూడాలి. ముసిల్ది ఆనాడే మరణించింద
నే విషాదం తనలో కనిపిస్తున్నా, దానుకి మొహంలో చెప్పన
లవికాని తేజస్సొకటి పొడగట్టింది. ఆనీళ్లకళ్లలో దేదీప్యమా
నమైన వెలుగొకటి జిగేలుమంది. ఆనందంలో ఉక్కిరిబిక్కిరి అ

యిపోయినాడు. "ఇదేకాబోసుదేవు" డనుకున్నాడు. ప్రపం
చం అంతా జీవంలేనిదానిలా కనిపించింది. మిగిలిన—అనిత్య
మైన తనస్వరూపం, నిత్యమైన ఆత్మ తనలో, ఎక్కడో నిత్యమ
ని తలవబడుతూవుంటున్న దేవుడున్నూ, తెరచాటున. "ఆతె
ర వీడడం ఎప్పుడు - ఆదేవుడగుపడే దెప్పుడు" ఇదీగుంపదా
సుని ఆలోచన.

* * *

వీరేసు మాదిగాళ్ల కులపెద్ద. ముసిలిపండు. లోకవ్యవ
హారాల్లో ఆరితేరినవాడు. చిన్నప్పటనుంచీ చదువుకున్న పు
రాణాలు, హరికథలు, కీర్తనలు మూలంగా కొంచెం తత్వజ్ఞా
నం అలవర్చుకున్నాడు. కొంచెం నియమాలకి లొంగిన మనిష
వడంవల్లనూ, ఊరికి రామమందిరం తానే కట్టించి ఇయ్యడం
చేతనూ, అతనంటే చాలామందికి అభిమానమూను, గౌరవ
మూను. అందుకనే అతని ఎరికిని ఎవరూ తాగరు వాళ్ల కులస్తు
లు. ఒకనాడు వీరేసు గుంపదాసుని చూడడానికని అతని గు
మ్మంలోకి వెళ్లేడు. తీరికగా కూచుని కూడబలుక్కుంటూ చ
దువుతున్న "రామదాసుకీర్తనల" పుస్తకం మూసేసి, పెద్దవా
డు ఇంటికి రావడమే మర్యాదా అని సంతోషించి, చింకికంబళీ
నేలవేసి "రండివీరేశుమామా" అంటూ వచ్చినాయన్ని ఆహ్వా
నించికూర్చోబెట్టేడు.

వీ:—"ఏందాసు మామా! అలా దిగాలుగా వున్నా
వు? ఇంకా చింతమాసిపోలేదా? అయ్యో! ఏటొభ్రమ, వె
ర్రోడ."

దాసు:-ఏటిచెప్పేది మామా నాదిగులు? ఇంతకీ రేక్కగికేసిన పచ్చినైపోనాను కదా! బ్రిమంతావు నువ్వు. బ్రిమకాకేటి? ఎందుకీబతుకు, చావనేద్ది? యారికోసం సెపుదూ? ఆముసిలిది రమ్మంటోంది. ఆబగవంతుడి మాట ఇంకా కానేదు. సత్యం చెప్పుతున్నాను; బతుకంటే భీతేస్తోంది మామా!

వీ:—"వెర్రోడా! సావడానికీ బ్రితకడానికీ మనతరమటోయ్. పుట్టించినోడూ, చంపినోడూ ఆ పరమాత్ముడే. అతగాడు చేసినపనికి ఇంక అపీలు లేదూ. శివునాజ్ఞ లేనిదే సీమైనా కుట్టదూ. ఏటనుకున్నావో? ఇంకాఏదాంతానికెడితే మనకిలోతే దొరకదు. బతకడం నీ ఒక్కడికోసం కాదోయ్. అలాటోళ్ల బతుకు పాపిష్టిబతుకోయ్. నువ్వు దేవుడికోసమే బతకాలి.

దాసు:- వహ్వా! అదేటి మామా మీాపిచ్చిమాటలు? ఆపరమాత్ముడికి యీా బక్క ఏంచేస్తాడు? ఆయనకోసమే మనం బ్రితకటం ఏమిటి? దోమెక్కడ? ఏనుగెక్కడ? నాకేటీ బోదకానేదు నీ ఉపదేశం.

వీ:-నువ్వేసింది ఘనమైన పశ్నే కానీ, దాసూ, దానికి జబాబు సీనాటి పున్నెత్ముడికి నచ్చచెప్పడం రొక్కటం పనికాదు. భగవంతుడేటన్నాడంటే "ఓమనిసీ! నిన్నెవరేనా ఓచెంప మీాదకొడితే, రెండోచెంపకూడా ఇచ్చెయ్యి" అదే కాదయ్యా గాంధీగారు లోకానికి చూపిస్తున్నది. "అడిగినోడికి నేదనక" తెలిసిందా? మనం ఒకళ్లికిస్తే, మళ్లా ఆళ్లుమనకియ్యాల. ఓయ్!

ప్రపంచం, ఋణసంబంధం గాదటోయ్. మనం పెట్టి పుడితేకా .దా మనకి రావటానికి. యీవేళ నాకో కూరగాయ నువ్విస్తే, నాకు కలిగిన్నాడు నీకియ్యాలని బుద్ధితోస్తుంది. లేకుంటే లోకం సాగ్గలదా? అంతాబంగారంతోటే పుట్టేరా? ఇలాటిదే దేవుడికోసం బతకడం అంటే. తన బిడ్డలికిస్తే తనకిచ్చినట్టుకాదా? అలాసంతోషిస్తాడనే "లోకతండ్రి" అయినాడు. అదీ రహాస్యం.

దాసు:-మామా నాకేటో చెప్పరాని ఆనందం వస్తోంది. నాకీ గుడిసెలో ఏదో వెలుగు కనపడుతోంది. నీవాక్కులకి అర్థంవుంది కాబోసును

* * *

చేత పుస్తకం పుచ్చుకుని గుడిసిచేరి దీపబ్బుడ్డి ముట్టించి సిల్వారికాడ కళ్లద్దాలు ముక్కునేసి, ఓతోలువటకా దానికికట్టి తలమీాద నించి ముడిమీాదికి ఎత్తికట్టి చదవడం ఆరంభించేడు గుంపదాసు-వచనం అయినా పదంమోస్తరుగా.

"ఓయీ నరదేవతా! శ్రీ కృష్ణపరబ్రహ్మ శంఖంవూది చాటించిన విషయం ఏమంటే— నేను ప్రేమచేతనే ప్రపంచం రాజ్యమేలుతున్నాను. ప్రేమచేతనే నాబిడ్డలని నా ఒడికి లాక్కుంటున్నాను. ప్రేమచేతనే వారికి నిప్పు, నీరు, ఎండ, నీడ, కూడు గుడ్డ, ఇస్తున్నాను. ప్రేమే సత్యం ప్రేమే నిత్యం-ప్రేమే పరబ్రహ్మం-ప్రేమే నారూపు—అన్ని రూపాలు

నేనే—అందరూ నా రూపాలే. ప్రేమతోటే ఈశ్వరుడ్ని సా ధించాలి—అది లేని వారికి జననమరణాలు నిలకడ అయిపో తాయి''—అని శలవిచ్చినారా?

దాసు: ఎంత ఇనోదంగా రాసేసినాడోయ్ కవి. ఎవరిది సెప్మా యీ గ్రంధం?-'దిడ్డి-జగన్నాయకుల చాతానోరి విరచి తం'-అని ఉంది. చాతానోరా? మహాత్ముల్లకి మాటలకే కొఱ వా? వారి సున్నితం మనకి రమ్మంటే వస్తాదా? పూర్వంటా, దివ్వె పురుషులుచంకల్పించుకుంటె ఆకుమీద ముల్లు తగిలించ కుండానే రేతిళ్లు స్వప్నాల్లో భగవంతుండు రాసిపారేసోడంట. అబ్బా! ఏటి వారిశక్తి, సామర్దం! ఆయన ఏరూపంతో వచ్చి రాసేవారో! మనూరి శరణంగారి నాగో—లేకుంటే పీడరి గు మస్తానాగో కావాల. ఛీ! అంత పిచ్చోడేటి దేవుడుమాత్రం. అయితే ఏటి యీ ప్రేమవాక్యం? నాకేటిఅర్ధంకానేరదు. అం తా ప్రేమమయం అంతారు కాని విశదీకరించినారుకారు గురు వులు. ఆయనకి రూపే లేదట. మరెలా కనబడతారో మన కి. "అందరూ తనే" అంటే మాలమాదిగల్లోకూడా నిలుత్తారే టి ఆయన? ఎంతమాట? తెలుసుకోవాలి—వీధిలో పదం విను పుకొస్తోంది:—

"కన్ను తెరచిననీవు- కన్నుమూసిననీవు
దీనగతికూచుండి దిశలెల్ల చూసేను
బ్రిహ్మాకల్పంబంత క్రిమ్మినట్లుంటావు—
కృష్ణా! క్రిమ్మినట్లుంటావు!"

తలుపుచప్పుడు.

దాసు:-ఎవరు? వీరేశమామేటి? (తలుపు తీయును.)

వీ:— ఇంకాపొద్దు పొడనేదు- వటీతోచక వీధిలోకొస్తే జామ్మని మీాదీపబ్బుడ్డి వెలుగుతోంది. కాలచ్ఛేపంఅనొచ్చాను. మీా గుడ్లేంటలాగ చింతనిప్పుల్లా గున్నాయి? నిద్దర్నేదేటి మామా?

దాసు:-మీారొచ్చి తెలిగేసేదాకా నాకీ నోకంగోడవే తెలీదు. దీపం పెట్టేనో, పుస్తకం తీసేనో, ఇప్పటికి కన్నుచివాషని మూాయేలేదు. మామా! మీాగ్రిందం మాదొడ్డగ్రిందం. కాని సందేయాలున్నాయి సుమండీ. తమవాకబేటో. దయసేయండి గొంగళీమీాద. చలేస్తోందేమో కుంపటితాజేత్తునా?

వీ:-వద్దు. మనకాబంది నేదు.

దాసు:-అయితే మామా! యీానోకం అంతా ప్రేమం తారుకదా గురువులు-అంటే వటి తాత్పర్యం?

వీ:-అంటే, లోకంలో జనులుండారే, వారు పరస్పరం అభిమానంతో సంచరించి, ఒకరినొకరు ప్రేమించుకుంటూ, సాయంచేసుకుంటూ, ఒకరికష్టాలకొకరు అవుతూ, సుఖాలకి ఒకరు అవుతూ, ఆ పరమాత్ముడిని బందుగులకంటె ఎచ్చు ప్రేమతో చూాస్తూ వుండడంలాంటిది. అయితే యీానీతి ఒక్కమానవులకేనా? జీవకోటికంతానా! జీవకోటికంతాను. అయితే యీాస

తిపట్టింపు మానవులకివుందా అంటారేమో! లేదు. అందుకనే అందరికీ కష్టాలురావడం-వారువారు చేస్తున్న దుర్మార్గాలకి ప్రాయశ్చిత్తం పొందుతూ భగవంతుడ్ని తిట్టడానికికూడా ఇదే కారణం. ఇలాటిప్రేమ కలాడు కనకనే పరమాత్ముడనతారా లత్తి, జీవుల్ని, పాపాత్ములనుంచీ పాపాలనుంచీ రక్షించేడు. ఇంతకి మనోళ్లకె బుద్ధిలేదు. ఒకర్నిచూస్తే ఒకరికి కిట్టదు. ఇరుగంటిఅమ్మ పుల్లాకువండితే, పొరిగింటిఅమ్మ తోటాకువండి దెప్పుతుంది. ఆరుబాగుంటే యీారికి దుఃఖం. చెప్పకు మామా యీాలోకం.

దాసు:-మరైతేనేను నా ముసల్దాన్ని ఎట్టిమాదిరి ఆదరించే వంతావు? అదీ ప్రేమేనా?

వీ:-అదీప్రేమే కాని, అది నీస్వార్థంకోసం చేసుకున్నావు- సహాజమే- కాని ఎవరికి ఉద్ధరింపంటాను. రహస్యం ఏటంటే మనిషిస్వార్థం విడిచి, త్యాగం అనుకరిస్తూ, శక్తికి లోబడిన సాయం మానవులకిచేస్తే నువ్వూ వారుకూడా చ్షేమంగా నుంటారు. అదే కాదటోయ్ గాంధిగారి మొట్టు- గాంధిగారి కేటుందోయ్ ఇప్పుడు? ఏటుంది.

దాసు:-ఆయనకేటి చక్రివర్తి. కానిమామా! పరమాత్తుడికి మనమే రూపాలంతారు కదా గురువులు, మనం మాల, మాదిగలంకదా, మనంకూడా ఆయన రూపేనా? చిత్రిం!

పీ:-కాదామరి. తండ్రితేజస్సు బిడ్డలకి వుండదా? మన లోనూ ఉన్నాడాయన. కులబేదాలు దేవుడా మరి పెట్టింది. ఛేస్. ఎప్పటికీ కాదు.

దాసు:-అయితే మనం ఇస్తే భగమంతుడు పండు, కాయా తింటాడా? మనమియ్యొచ్చా? మనం అంటరానోళ్లం కాదా?

పీ:-చంపేసినావు మామా? ఇంత పురాండం విని ఇదా ఇశిదం అయింది నీకు? నేనేం చెప్పినాను?

“కృష్ణపరమాత్మ శలవిచ్చిన సూత్రిమేటంటే ‘నా పేరు చెప్పి ఏజీవుడైనా నాకు ప్రేమతో, ఫలాపేచ్ఛ లేకుండా పండైనా, కాయైనా, కడాకి గడ్డిపోచైనా సరే దాఖలు చేసుకుంటే ఆజీవుడ్ని నేను ప్రేమించి నాలో నైక్యంచేసుకుంటా నన్నారు కాదా! ఫలా పేచ్ఛొద్దన్నారు- గుర్తించు-ఆ. అది చూచుకో., ఎవరిస్తే నేటి ప్రేమవుండాలి కాని. శబరి ఇయ్యలేదూ రాముడికి ఎంగిలిచేసిన పళ్లూ? తిన్నేదా ఆతండ్రి? ఇప్పుడు ఆవి డెక్కడుంది? ఆయన హృదయంలోనే అంతకన్నానా?

దాసు:-మామా! నాకేటో ఆనందం ఉక్కిరిబిక్కిరై పోతోంది. బతికినందుకు ఇది ఇనడం అయింది కాని ఒకటిసుమా: ఇన్నాళ్లుబతికేను. ఇంత తెచ్చేను తిన్నాను, కాని పట్టుమని పిడికెడుగింజలు బిచ్చంపోసిన పాపమెరుగన్నాయనా! చేసినపాపం

సెబితేపోతుంది. ఆముసిల్దేటి చేసిందో, ఏమో అంతే అన్నా! యీకాలం అంతా వృధా అయిపోయిందే అని దిగాలుమంటోంది ప్రాణం. ముందు జాగ్రత్తకైనా ఆధారంకద్దో నేదో!

వీ:-నీకాపశ్చాత్తాపంవుంటే నీకుఫర్వాలేదు. చంకల్పం స్థిరం అయితే సిద్ధించదా? శలవా? రాం, రాం.

* * *

“గోవిందరాజులు పఠంమీద రోజూ గన్నేరుపూలేసేనుకానీ, పఠాలకి పదేపదే సుడితిరిగి మొక్కేను కాని, ముసిల్దినేను పెళ్లికీ యాజమాన్యానికీ సత్తెనారాయణ వ్రతం చేసుకున్నాం కానీ, ఏకాదశిలకి పస్తులుంటిమి కాని, ఓమాటూ ఆసందబాస్పాలు కుర్నేదు. అప్పుడేదో కోరికలుండేవి కాబోసు. తీర్థాలకెళ్లినా, పెద్దూళ్లల్లలేదు. “పోరామాదిగా” అని తరిమేసారు బేమ్మలు. కాని వీరేశుమామ గ్రిందంచదివితే ఏటిసెప్మా ఆనందం ఉబుకుతోంది. కన్నీరు ధారైపోతోంది. ఆహా! అరవైయేమో పడికన్నేళ్లల్లేమో? యీ నాటికొక్కరికో కూరగాయ ఇచ్చినపున్నేనికిపోలేదు. ఇరుగింటిలచ్చి దగ్గుతో పీండిస్తించుతుంటే వుండీకూడా కరక్కాయానా ఇచ్చినానుకాను. రేతిరిపగలూ, కడుపులు చేతపుచ్చుకుని “అమ్మా” “నాన్నా” మూడురోజులెంబడి తిండిలేదు, పిడికిటిగంజి, అంటే, ఆలదుక్కున్నవోళ్లని కుక్కల్ని తరిమినట్టు తరిమేసేను. ఒంటికి చాలని గుడ్డతో ముక్కాళ్ల ముసిల్ది “బాబూ, గుడ్డీవూ” అంటే “ముసిలీ! నీకు సానదే కట్టుకున్నవే” అని సిగ్గుమాలి అడిగినా

సు. "నారాజే" అంటూ వెళ్లిపోయిందది. దానిపూర్వోత్తరం ఏటో? అంతెందుకు; నా చినబాబుకొడుకు పిల్లాదిరి వరాసమూ డుకోజులు "గంజి, గంజి, గంజి" అని మొరెడితే ఊరోళ్లపశు వులకి పారబోసినానేకాని, ఓబుక్కెడాళ్లనోట బోసినానుకానే. ఇక దేవుడు నన్నెలాచూాత్తాడు. అయ్యో మాయలోకం, ఇం త స్వార్థమా? ఊళ్లూపల్లూ ధారపొయ్య మన నేదే ప్రభువు లు. ఉన్నగంజిలో ఇంత ఉప్పేసి, కాస్త ఒలకపొయ్యమన్నా రే ప్రభువులు, అడిగినోడికి. పెట్టంది మనకెలావస్తుంది. కమ్చీ దెబ్బలుతగుల్తున్నాయి నాతప్పులకి. దేవుడా! బుద్ధొచ్చింది. తెలియక జేసినాను. క్షమించు ముందు నీకాలువే. నీ బిడ్డలకా లువే నాభాగ్యం." అంటూ పోరుపెట్టేడు గుంపదాసు.

ఏదో ఒకదశ ప్రతిమనిషికీ విజ్ఞానప్రాప్తికి సమయం అ వుతుంది. కాని గ్రహింపో? సంశయం. వెర్రివాడు గుంపదా సు. తానొక్కడే అనుకున్నాడు యీ ప్రపంచంలో తనలాం టివాళ్లు- స్వార్థం ఎంచి పరోపకారంఅంటే పురేసుకున్నవారు. మహామహులు, ధనాఢ్యులు, భూకామందులుకూడా యీకా లంలో స్వార్థంలో మైమరచి, "సర్వం అహం" అనుకుంటూ ఇహం ఎరిగి, పరం మరచి, గుంపదాసులాగైనా; చిట్టచివరకి పశ్చాత్తాపమేనా లేకుండా, పైపెచ్చు "ఆత్మసన్యాసమని, నా రాయణోపాసనని, తులసీనీళ్ల"ని, జంకూ బింకూలేకుండా స్వీక రించి, "దేవుడు, రథంపడుతున్నాడు పోతాన"ని ప్రగల్భాలు చెప్పి చచ్చిపోయినారంటే ఎక్కడికిపోయినారని మీాయభిప్రా

యం? ఏమోయ్, గుంపదాసు, నీవుచెప్పకలవాలంటే "ఆమా
ట నానోటరానీయకండి బాబూ" అంటాడు. మళ్లీ యీపెద్ద
లదైవభక్తో? కొండలు, పుట్టలు పారిపోతాయి. ఫలానాపం
తులు ఆంజనేయస్వామికి బంగారు కవచం చేయించాడనీ- ఒక
ఇల్లాలు మాణిక్యాంబకి రత్నాలపుస్తెలు చేయించిందని, ఒక
అయ్యరు పార్థసారథికి కిరీటం వైఢూర్యాలతో చేయించాడనీ,
జాటింపులూ, పేపర్లలో ప్రచురణలున్నా, ఎవడుతిన్నసొమ్మి
దీ? రాళ్లపాలు. దేవుళ్లకి నిలువుదోపిళ్లిచ్చే ఆసామీలు, ఆ
యనసన్నిధికి పోయేముందు, కాళ్లూ వేళ్లూబడి ఏడ్చేఅనాథులకి,
ఒక్కబట్ట, ఒక్కకానీ ఇచ్చేరేమో అడగండి? తనతోడివారికి
సహాయం చేయలేని మనిషి భగవంతుణ్ని, తన్ను సహాయంచే
యమని ఏమొహంతో కోరగలడు? ఇస్తాడనే? ఇచ్చేడనుకోండి.
అది పాపిష్టిసొమ్మని ఎవరికి తెలియదు? పుణ్యాత్ముని ధనం ప్ర
పంచకంలోనే వుంటుంది. దొరలది దొంగలకీ, మట్టికేని, యీ
సంగతులు తెలిస్తే గుంపదాసు కంతవిచారమే వుండేదికాదు.
అయితే దేశం గొడ్డోయిందా? యీకాలంలో దానం, ధర్మం
అడుగంటాయా? దేశసేవ, మానవసేవా నశించేయా? అంటా
రేమో? యేమో? దేశాభ్యుదయానికి చాలిన యే సేవాలేదు
ఇప్పుడు. ఏ ఒక రిద్దరో అక్కడక్కడ పరోపకారబుద్ధిగలవా
ళ్లున్నారంటే, వాళ్లుపైకిరారు. వాళ్లుచేసేది పవిత్రసేవ. ఖేమ
జంకోసం చెయ్యరు. చేసినదానిని అచ్చులో గుద్దించుకోరు.

* * * *

కొంతకాలం జరిగింది. గుంపదాసు దైవభక్తి ఒకస్థాయి

లోపడి రోజురోజుకి వృద్ధవుతోంది. తనకష్టాలు పూర్తిగా మర
చిపోక పోయినా పూర్వం అంత విచారంలో లేడిప్పుడు. ము
ప్పొద్దులూ దైవచింతే అతనికి. శ్రీకృష్ణుని స్వరూపం తనహృ
దయంలో ప్రతిష్ఠఅయిపోయింది. తరంగాల వెంబడి వేణువుని
నాదం అంతులేని ఆమనస్సులో వ్యాపించిపోయింది. ఉన్మత్తు
డై పోయేడుదాసు. ఏంపనిచేస్తున్నా దేవుడే- కృష్ణుడే- జోళ్లు
కుడుతూ కుడుతూ ఆపేసి గోడకేసి వెర్రిగాచూస్తాడు. తిండి
తింటూ మానేసి గిన్నెకేసి అయోమయంగా చూస్తాడు.
గ్రంధం ఏదైనా చదువుతూంటే అతని అవస్థ చెప్ప నక్కర్లే
దు. శరీర మాపాదమస్తకం చలించిపోతుంది. హృదయం గుడి
గంటల్లాగ ఏదో మోగుతూవుంటుంది. సాధనం సమాధికి వ
చ్చింది. సమాధినుంచి దృష్టియే ఇంకా సమకూడలేదు. ఆ ఒ
గ్గుపోయిన ఆశరీరం అదృష్టికోసమే నిలచివుంది. సాధ్యమా
తుందా? సమాధిలో వున్నాడు దాసు ఒక రాత్రి. రెండుఝా
ములు తిరిగింది. నూని అయిపోయి ఎప్పుడు ఆరిందో దీపబుడ్డి
అతనికే తెలీదు. ఇంతలో లోపల ఏదో చడిఅయింది. కన్ను
తెరచేడుదాసు. చిన్న ఏకాంతం వినవచ్చినట్టు "దాసూ; దా
సూ" అనే తొందర పిలుపు వినపడింది. గతుక్కున లేచి నా
లుగుపక్కలాచూస్తూ "బాబూ, ఎవరూ బాబూ" అన్నాడు.
ఎవ్వరూలేరు.! తలుపు వేసింది వేసినట్లుగావుంది. శబ్దంలేదు. ఏ
మీ అర్థంకాక మళ్లీ దాసు "ఎవరు బాబూ" అన్నాడు వెర్రి
గా "దాసూ! రేపొస్తున్నాను. కాచుకూర్చో" అనే జబాబు
వినిపించింది. తెల్లబోయేడు దాసు. ఎవరా అని ఆలోచన.

మనిషీ అచోకీయేలేదు, "ఏమిటీ చిత్రం" అనుకుంటూ లేచి కళ్లు తుడుచుకుని ఇల్లంతా వెతకి ఎవరూ కనబడకపోతే వీధి తలుపుతీసేడు. ఎవ్వరూ లేరు సరికదా, ఆకాశం అంతా కారుమబ్బుగావుంది. లోకం అంతా అంధకారమయంగావుంది. భయం వేసేటట్టు మెరుస్తోంది. రొజ్జుగాలి కొడుతోంది. చిన్న తుంపరపడుతోంది. అక్కడ నిలవలేకపోయి లోపలికివచ్చి తలుపేసుకున్నాడు. పడుక్కుందాం అనుకుంటే నిద్రపట్టలేదు. "ఆ పిలుపెవరిది?" "దేవుడు పిలిచేడా!" "నా కృష్ణుడొచ్చేడా!" "లేక వట్టి భ్రమా!" "మనిషి అలికిడిలేదే? ఏ రేకుమాము తమాషా చేసేడా!" ఇదీ అలోచనతనకి. "ఊ" అని విసుగ్గా గొంగళి మీద వాలేడు.

* * *

తెల్లవారింది. రోజువారిగా చేసే పనులు చేసుకున్నాడు దాసు. ఇంతగంజి, అన్నం, పులుసు, ఊరగాయ వేసుకుని, తినబోయేముందు కృష్ణుడికి ఆరగింపుచేసి "భ్రమ! మనకూడూ, మన గంజీ, ఆ మారాజుకి కావాలా? వెర్రి. ఆయనకీ తిండి అక్కరకోస్తాదా? సూత్రంలో, గడ్డిపోచ ఇచ్చినా మంచిదే అన్నారు కాని ఏటో అది తనసృష్టిమీద తనకివున్న ప్రేమ కాని......" అంటూ భోజనం చేయ్యసాగేడు. అవతల అఖండవర్షం; చలి; జనసంచారంలేదు. కిటికలోంచి చూస్తున్నాడు దాసు వీధికేసి. ఇంతట్లో మ్యూనిసిపాల్టీ చచ్చటివాడు, యజమాన్లుపంపితే గాబోలు, దాసున్న వీధిలోకివచ్చి పారతోటి వర్షపునీరు ఇళ్లల్లోకిపోకుండా చెరువులోకి దారిపెట్టి వర్షంలో

గుడ్డలు తడుస్తే, చలిచేత వణుకుతూ పార గోడను చేరేసి దాసు ఇంటికిటికీదగ్గర నుంచున్నాడు. దాసు వాడినిచూసి మామూలు వచ్చే చచ్చటాడిగానే గుర్తుపట్టినా, భ్రమచేత "కృష్ణుడే యీరూపానవచ్చేడేమో" ననుకుని, మళ్లీ "ఛీ! ఛీ! అనహ్యాం. ఆయన కేంపని ఇలారావడానికి- పొరబాటు" అని లెంపలు వేసుకుని చాదస్తం ఎక్కువై పోయిందని చిరాకుపడుతూ, తలుపుతీసి, చచ్చటాడిని పలకరించేడు.

దాసు:-'ఏం అన్నా! తడుస్తుండవా? లోనికిరా. యెచ్చగుంటుంది. అన్నన్నా! ముద్దయిపోనావే. ఏటి మునిగిందని పారొచ్చేవు పనికని ఇంత జడివాన్లో."

మ్యా:-బం. ఏంచేసేదిఅన్నా! దూటీ తప్పుతాదా! బత్తేం ఎందుకిస్తున్నారు? దయగలాడివి పిల్చినావు లోనికి. ఎవరు రమ్మంతారు యీకాలంలో చలేస్తోంది. ఎముకలు గుంటుపట్టి పోయినాయ్." అంటూ గుడ్డలు పిడుచుకుంటూంటే, దాసు వాడిని లోనికితెచ్చి పొడిగుడ్డలిచ్చి, గొంగళిమీద పడుకోబెట్టి, కుంపటిసెగని కాచేడు. కాస్త వెచ్చగా వుండగానే కాఫీకాచిచ్చి, రాత్రి తనకివినపడిన "పిలుపు" వృత్తాంతం వానికి వినిపించేడు. "నాకే సిగ్గవుతోందన్నా! కృష్ణుడు నాగుడిసి కొత్తాడనుకోడం" అన్నాడు.

మూ:-బం॥ అన్నా! నువ్వు నాకు గుడ్డా, కాఫీ ఇయ్యడంకాకుండా మంచి సమాచారం ఇనిపించినావు. నీకు వందనా

లు” అంటూ వెళ్లుతూంటే దాసు “అప్పుడప్పుడు వస్తుండ”ని కేకేసి తలుపేసుకుని కిటికీ దగ్గరగా కూచున్నాడు. కృష్ణుడొస్తాడనే.

* * *

వాన వెలిసింది. రోడ్డుమీద జనం నడుస్తున్నారు. పోలీసు వెంకటస్వామి వెళ్లేడు; తోళ్లసాయెబు అబ్దుల్లా నడచేడు, చాకలిపేరిగాడు, ఆదారినే రేవుకు పొయ్యేడు, ప్లీడరుగారి సైసు ఎండిగాడు గుర్రాన్ని నాళ్లు వేయించడానికి అల్లే తీసుకెళ్లేడు. కాని, దాసూ! రేపొస్తానని రాత్రి చెప్పినవ్యక్తి ఇంకా రాలేదేమా” అని చూస్తున్నాడు దాసు. “వెర్రిబాగులోణ్ని.” అని నవ్వుకున్నాడు. అప్పుడే చిక్కి, శల్యం అయిపోయిన ఒక స్త్రీ, తనకంటె చిక్కిన ఓచేతి బిడ్డని చంకపెట్టుకుని వీధంటపోతూ, దాసుని చూసింది. దాసు యీమనిషి నెప్పుడూ ఇదివరకు చూడలేదు. కొత్త మనిషి; చిక్కి, నీరసంగా, బక్కపేగుల్తో, గుంటవడిన కళ్లతో, నొక్కుకుపోయిన దవడలతో, చింపిరిజుట్టుతో, ప్రత్యక్షమైంది దాసుకి. చంటిపిల్ల ఎడతెగకుండా ఏడుస్తోంది. ఆపిల్లకి కప్పడానికి తల్లిదగ్గర చిన్నగుడ్డ తప్ప ఇంకేమీలేదు. ఆమెకికూడా వక్షస్థలం దగ్గర, నడ్డికేమాత్రం చివికిన గుడ్డమాత్రం ఉంది. ఆమె దాసునిచూసి “నాన్నా! కటాచ్చించవా” అని దీనంగా పలికింది. దాసుకి కడుపు చెరువైపోయింది. కరుణ పొర్లిపొర్లివచ్చి కళ్లల్లోంచి అశ్రుల రూపాన్ని పొందింది. “లోపలికిరాతల్లీ” అని తీసుకొచ్చేడు. తడబడుతూ వచ్చిన ఆమె చేతిలో బిడ్డని తానుతీసుకుని, బొక్కినోటితో

యీాలవెయ్యాపోతే యీాల ఎలావస్తుంది? అప్పుడు ఆపిల్ల గెడ్డం వ్రాపి "ఊ" "ఉక్క" అన్నాడు. చిన్న నవ్వునవ్వింది పాపం. ఆపిల్ల "నాయమ్మే! ఎన్నాళ్ళకి చూసేనే తల్లీ నీనవ్వు" అని రెండు కన్నీటి బిందువులు రాల్చింది ముష్టితల్లి. దాసు సంతోషానికి మేరేలేదు. "ఆనందమే బ్రహ్మస్వరూపం అన్నారు గురువులు" అన్నాడు.

దాసు:—అమ్మా! కుంపటి శెగనికూచో; యీాబట్ట మీా యమ్మకికప్పు- యీాచీర నువ్వుకట్టుకుని, దానికొంచం తడి చూపుతల్లీ, గుక్కెట్టుతోంది, అన్నాడు.

ముష్టిది:—"తండ్రీవంటోడివి. నీదగ్గర దాపరమెందుకు! బాబా- పాలునేవు- మూాడుదినాలాయిపస్తు- ఏం టుంటాయి- అక్కడికీ అదుముకుంటే తాగద్దూ! కేరుమంటుంది. నాజీవనా లెగిరిపోతాయి అప్పుడు. ఏదేవుడు రక్షిస్తాడు యీాకలికాలంలో" అంటూానే బిడ్డమీాద ప్రేమచేత తల్లి పాలివ్వడం మొదలుపెట్టింది. అంతిహీనస్థితిలోనున్నా కన్నబిడ్డకంటే గారామేమిటి? "కృష్ణా! నీబిడ్డలమైన మమ్ము నువ్వు అలాచూస్తావా!" అనుకున్నాడుదాను. దాసు లోపల్నించి ఒక కంచంలో అన్నంనూా, ఒక గిన్నెలో గంజినీళ్ళు, చిన్నఆకులో ఒడియం, దబ్బముక్క, ఉప్పున్నూా తెచ్చి, తల్లిచేతులోంచి బిడ్డనితీసుకుని, ఆ ముష్టిదానికి భోజనంపెట్టి, కూాతురికి చేసినంత మర్యాదచేస్తే "దేవుడే యీాముసలాడి రూాపాన, తనకోసం, వెలిసేడని సం

తోషిస్తూ ఆమె రెండుజుర్రల్లో అంతాతినేసింది. ఆమెక్కావలసినంత కొసరి వడ్డించేడు.

దాసు:—"హా! తండ్రీ! పున్నెత్తుడవి నాయనా, నీమేలుకి దేవుడు నిన్ను కాయాల" అని హృదయపూర్వకంగా దాసుని దీవించింది.

ముష్టిది:—నా మొగుడు వతాలానికెళ్లి మళ్లీ తిరిగి రానేధు నాయనా; అతనెళ్లిపోయిన్నాటికే యీగుంటని నీళ్లోసుకున్నాను. ఆదారంలేక నాయుడుగారి ఇంట్లోవంటకి కుదిరేను. యీబిడ్డపుట్టిన తిర్వాత "చంటిపిల్లతో వంనౌకిరీచేస్తావు, మానుకో" మన్నారు నాయుడుగారిభార్య. వెరే దిక్కు నేదుతండ్రీ, రచ్చించాల, అని కాళ్లా వేళ్లాబడితే, నాయుడుగారు, అమ్మగారిమాటేచెప్పి, ఆ రోజుకి ఇంటోవుంటే జవానుచేత గెంటిస్తానన్నారు. మూడునెల్లుంచి ఇదేగతినాకు, నిలవనీడలేదు, తినతిండిలేదు, కట్టగుడ్డలేదు. యీ బస్తీలో గొడ్డోయింది దేశం. ఇది చేసేదినేక "తప్పదా భగవంతుడా" అని ఆ గొల్లమ్మిపోదుస్తే బేమ్మలింట్లో పాలతల్లిగా నెలకి రూపాయకి కుదిరేను, ఆవుపాలకంటె చౌకయిపోయిందాళ్లకి. పోనీ, అదేసాన, బిడ్డ ఆయిదానికైనా చాలదా అని జార్చుకుంటే, తిండిలేక నేను చీణించినాను. పాల్లేవు. నాలుగు రోజులైంత తర్వాత బేమ్మలే "నక్కనైపోనావు. నువ్వాక్కర్నేద"ని రోజువారీ అర్ధణాచేసి లెక్కచూసి నెలసిల్లరెదికావాల, పదనాలగణాలు ముట్టసెప్పేరు. అంతేవస్తదిఅన్నాడు వాళ్లనౌకరు. నాకు నెక్కా-

డోక్కా తెలీదు మారాజా. అయ్యో నాయనా! నాకద ఇని ఏడుస్తున్నావా? వెర్రివోడివి నాలాంటోళ్లెందరో యీ నోకం లో, యీ అగాదంలో, నీలాంటోళ్లేరుకాని ఇక సెప్పన్నే."

దాసు పెట్టెలోంచి తనభార్యవి మిగిలినచీర్లన్నీతీసి అర్ధ రూపాయితీసి ముష్టిదానికిచ్చి, కూతుర్ని అత్తవారింటికి పంపినట్లు పంపేసేడు. తనదగ్గరవుండిపోతే సంరక్షిస్తానన్నాడు. కాని ఆమె వుండనంది. ఎంచేతో? వెళ్లిపోతూ, "నాయనా! ఏదేవుడు పంపేడో నీదగ్గరకి" అంది. "కృష్ణుడేమో" అనుకుని లోపలనవ్వుకున్నాడు దాసు. ముష్టిది వెళ్లిపోయింది. మళ్లీసమాధిలో పడ్డాడుదాసు. "కృష్ణుడురాలేదు, ఏ రూపంలోవస్తాడో? అనే అతనికి ఆలోచన.

వీధిలోంచెవ్వరూ నడవడంలేదు. మిట్టమధ్యాహ్నం. కొంతదూరంలో మాత్రింపళ్లది. "ఏయ్ జామీపళ్లూ, ఝామీపళ్లూ- అన్నాఫల్లీ ఝూమీపళ్లూ ... ఏ" అంటూ అరుస్తోంది. ఆమెనెవ్వరూ పిలవలేదు. దాసు కిటికీకెదురుగా తట్టదించి అలసట తీర్చుకుంటోంది. తట్టకివెనక తట్టునుంచి ఓపల్లెవాళ్లకుర్రాడుకాబోసు 6, 7 ఏళ్లవాడు నెమ్మదిగా తట్టచేరుతూ రెండు పెద్ద జామిపళ్లు దొంగలించి పారిపోతుంటే "పాపడా" అంటూ పళ్లది వాడిజుట్టుపట్టుకుని దొరికించుకుంది. "అమ్మో! బాబో!" అంటూ బొబ్బలెడుతున్నాడు వాడు- ఇదంతా పెంకితనంగా చూస్తున్నాడుదాసు, తన చిన్నతనపుచేష్టలు జ్ఞాపకంవస్తే నవ్వుకుని, తలుపుతీసి పళ్లమ్మిదగ్గరకెళ్ళేడు, కుర్రాడు విడిపించు

కుందుకు గుంజుకుంటున్నాడు. పైట విడిపోతూ జుట్టుముడి జారిపోతూ పళ్లది వాడిని పట్టివుంచి మొట్టికాయలు మొదుతోంది. నోటికివచ్చినట్టూ తిడుతోంది. వాడేమో అరుస్తున్నాడు. ఏడుస్తున్నాడు.

కురాౖడు:—పళ్లుతీయలేదమ్మో.

పళ్లది:—మరెవరాౖ, నీఅబ్బటౖ, పోకిరీ?

కురాౖడు:—కొట్టేవంటి చూసుకోమరి—ఒగ్గెయ్.

దాసు:—అవ్వా కురోౖడినొగ్గెయ్. యీతప్పుచమించు.

పళ్లది:—యీపళ్లపాపడిని నేనొగ్గుతానా, యీడిపనిపట్టిస్తాను. రా పోలీసోడి దగ్గరకి- రా.

కురాౖడు:—అమ్మోమ్మ, పోలీసోడొద్దో- ఏడుస్తాడు.

దాసు:—అవ్వా, దయవుంచి యీ తూలి ఒగ్గెయ్- ఇంకెప్పుడూ సెయ్యడ్నే- నామాటిను.

పళ్లది కుౖరాడిని వదిలేసింది. వాడు పోబోతూంటే గుంవదాసు ఆపి, "అవ్వని చమించమనాౖ" అన్నాడు.

కురాౖడు "ఏడుస్తూ" ఎప్పుడూ చెయ్యనమ్మో, చమించమ్మ"

దాసు:—ఎప్పుడూ చెయ్యకే? నేనుచూసే నువ్వు పళ్లుతి య్యడం" అంటూ గంపలోంచి రెండుపళ్లుతీసి వాడికిచ్చి"అవ్వా! డబ్బునీకిస్తానే నేను', అన్నాడు. కుర్రాడు తెల్లబోయేడు.

పళ్లది:—ఇలాగే కుర్రపాపలు పాడయేది. ఏమిసత్యకా లం. వాళ్లుపనులు మానార్రా? ఇలోటోళ్లని సితకతంతే బుద్దొ స్తుంది. ఎక్కడయ్యా, యీయయ్యా ధర్మదాత!

దాసు:—"అవ్వా! మనుష్యులం కనక మనం వాళ్లనితం తాం. దేవుడలా చెయ్యడే. తనబిడ్డలుచేసే తప్పులు చమిస్తాడు తప్పొప్పుకుంటే. రెండుపళ్లు తీసిందానికే వాడ్ని సితకతంతే, మనచేసిన పాపాలకి మన్నేటిసెయ్యాలా?

మునలిదానినోరు కట్టుబడింది.

దాసు:—మనం ఒకరినేరాలు చమిస్తే, భగవంతుడు మన నేరాలు చమిస్తాడు. అది కానీవరస ... పళ్లది వెళ్లిపోయింది- డబ్బడగలేదు. దాసియ్యలేదు. కొంతదూరంలో పళ్లదీ- కు ర్రాడూ, కలుసుకుని స్నేహితులమల్లే వెళ్లిపోయినారు. దాసు కి చాలాఆనందం అయింది.

ఇంట్లోకిపోయి దాసు చెప్పులు కుట్టుకుంటున్నాడు. ఆ రోజున జరిగిన మూడునాటకాలు తనతలంపుకి రావడం, వాటి సందేశమేమిటో అర్థంకాకపోవడం, చికాకుగా వుందాతనికి. అలసటచేత "కృష్ణా! కృష్ణా" అంటూ చిన్న మమతలాగ వ

చ్చినని(ద్రలో పడ్డాడు. వెంటనే మ్యూనిసిపాలిటీ నౌకరు, ముష్టిది, పళ్ళది, కుర్రాడు, చంటిపిల్ల, తెరలో బొమ్మల్లాగ కనిపించేరు. ఊహావేమో! కాసట్టుగా ఆవ్యక్తులు అతన్ని లేపి "దాసూ, కనిపెట్టేవా? మేమే, మేమేసుమీ," అంటూ అంతా అంతలో శ్రీ కృష్ణరూపాన్ని దాల్చి మురళి వాయించేరు. దాసుకి వినిపించింది దాని అమృతస్వరం. స్మారకం తప్పింది. పలవరించేడు. "కృష్ణా ఇదా నీ ప్రేమసూత్రానికి అర్థమూ. ధన్యుడను, ధన్యుడను, మానవసేవయేకదా నీసేవ- పిలుచుచున్నావా? వచ్చుచున్నాను, తండ్రీ వచ్చుచున్నాను. దాసు గుడిసెలోనుంచి దివ్యమైన తేజస్సు ఆకాశవీధిని వెడలినది.—



# హీరాసుందరి.

1653 వ సంవత్సర ప్రాంతమునం దౌరంగజీబు రెండవ
తూరి దక్కనుకు సుబేదారుగ నియమింపబడినాఁడు. ఔరంగబా
దాతని యాస్థానమై యుండెడిది. మర్షిదుఖులీఖాను డాతని ప్ర
ధానమంత్రియై రాజ్యాంగ విధానమున నౌరంగజీబునకుఁ బలు
విధముల సహాయుఁడై యుండుటయేగాక మిక్కిలి నమ్మిన స్నే
హితుఁడునుగూడనై యుండెను. ఆ సమయమందే యౌరంగా
బాదునకుఁ బోవుమార్గమునఁ గల భరణిపురరాజ్య ప్రతినిధిగ
నౌరంగజీబు పినతల్లి పెనిమిటియగు సయూఫ్‌ఖానుఁ డుద్యోగ
ముఁ జేయుచున్నాఁడు. ఈతని జనానాయందు నవలావణ్యావతి
యగు, 'హీరా' యను పదునెనిమిదేండ్ల ప్రాయముగల
దివ్యసుందరి యొకతెకలదు. ఈమె సయూఫ్‌ఖానుని కుమార్తె
యని కొందరు, నుంపుడుకత్తెకుమార్తెయని మఱికొందరును
చెప్పుదురు. ఏది యెట్లున్నను, హీరామాత్రము సయూఫ్‌ఖా
నుని భార్యవలనఁ గడుపునఁ గన్నబిడ్డకన్న నెక్కుడుగ బెంపబ
డుచుండెడిది. హీరా తపతీనదీతీరమునఁగల 'జైనబాడి' యను
పట్టణమునఁ జనన మొందిన కారణమున, నాటి యక్బరు శాసన
ముప్రకార మామెకు 'జైనాబాడి' యను నామ మొసంగబడి
యెను; 'హీరా' యనునది యామె ముద్దులపేరు. సౌజన్య, సౌ
కుమార్య, సౌందర్య ప్రభృతి లలితగుణాలాలసయగు హీరాపు
ష్పము సయూఫ్‌ఖానుని హృదయానురాగ కటాక్షవీక్షణలచే

---

* డిశంబరు 1934 "చంద్రికలో" ముద్రింపబడినది.

సహస్రగతులఁ బెంపబడి యుండుటచేత నామె కంకురించిన యంద మూహ్యామే కాని వర్ణింప నలవికాదు.

పినతల్లి యాహ్వానము సప్రీతితో నంగీకరింపుచు నౌరంగజీ బౌరంగాబాదునకుఁ బ్రతినిధిగ నేగుతఱి, దక్కు సిబ్బందితో భరణిపురమునకు వేంచేసెను. ఢిల్లీ పాదుషాహి కుమారుఁడునుఁ బ్రస్తుత మొక రాష్ట్రప్రతినిధియు, వేఱుగఁ దోబుట్టువు తనయుఁడు నగు నౌరంగజీబు, పాదస్పర్శచేఁ దన గృహమును, బవిత్ర మొనర్ప రానున్న, నయూబ్ఖానుని భార్య యెంతయు వేడ్క సన్నాహములఁ గావించినది. పినతల్లిగృహమునకే పోవుచుండుటచేఁ గాబోలు, జనానా నియమముల నిర్లక్షించుచు, సంభ్రమాతిశయమున, తిన్నగ యంతఃపురమునకే వెడలినాఁడీ యువరాజు. ఆమె మహాలుఁ జేరులోపున, నడుమనొక సుందరమై, ప్రకృతిబాల నాయల నావు యుద్యానవన మొకటికలదు. అందు ఋతువివక్షతను బట్టి పూచి ఫలించు వృక్షరాజము లుండుటచే, సర్వకాలములయం దావనము వనలక్ష్మీ తాండవనిలయమై యుండెను. అచ్చటి లతామండపములు, సూర్యరశ్మిని ప్రతిబింబించుఁ జిగుళ్లధరించుచు, వేవేగఁ దోడ్తెంచు మలయమారుతమును గాఁగిళ్లనింపి భారముచే శిరస్సుల వ్రాల్చుచు నూతనయావనశోభను ప్రకాశించు నవోఢలో యనునట్లు ముద్దులమూటలై, సీటులనిగ్గులై, రతానలరాసులై, విరాజిల్లుచున్నవి. ఒక్కచో రత్నస్థగితమై, సువర్ణమయమై, చంద్రకాంతశిలానిర్మితమగు కుడ్య కోటీరములచే శోభిల్లు

సరోవర మొకటి; అందు నడుమనున్న గాజు జలయంత్రము నందు కుముదినీకాంతలు మిన్నంటిన తమప్రియుని ప్రతిబింబమును గాంచుచు, భ్రమపడి, యాతని జేరఁబోవ నుత్సహింపుచున్నట్లు సరోవర సంచలనముచే నిటు నటు నూగిసలాడుచున్నవి. అట్టిసమయమున నా యుద్యానవన మార్గముల బారులుతీర్చియున్న గంధపుజెట్లు లోకదాని నొకటి రాపిడియై తీయని గంధపుఁ బొడిని రాల్చుచు, నాదారులవెంబడి నేగు యౌరంగజీబు కుమారుని యంగమునఁ బూఁతపూసెను. ఆప్రదేశము వసంతమందిరము; దాని ప్రాకారముల నడుమఁ బ్రకృతిరమణి భావనాపురుషునితో నెల్లసమయములఁ గ్రీడించుచుండును; వనలక్ష్మియు నీశ్వరధ్యానమున నేకాంతసేవఁ జేయుచుండును; బాల్యము కేరిల్లురుకును; యౌవనము పెంపొందును; ముదిమి చిగుర్చును. ఇట్టి ప్రకృతిమాతృక నిలయమున కేగు తనయుల నురాగ, మోహపరవశులగుదు రనుటలో నతిశయోక్తి యేమి కలదు! నిరుపమాన సౌందర్యరాశియగు నౌరంగజీబు నీ యుద్యానవన సౌందర్య మెంతయు వికలచిత్తునిఁ జేసెను. అదేక్షణమున నాయుద్యానవనో పరిభాగమునుండి మనోవికాసస్ఫూరకైక మధురగీతి యొకటి, మానవతీ మానసతరంగములనుండి స్రవించుచు, నౌరంగజీబు హృదయతీరమును వేవేగ తాఁకెను. సమయాసమయ విచక్షత వీడి పరవశత్వమున, సంతఃపురమనియు, యువతీవిలాసక్రీడా ప్రదేశమనియు, యోచింపక, యీ తురుష్కరాజకుమారు డాకంఠస్వరము విననగు దిక్కు ననుసరించియే శరవేగమున నేగినాడు. పోఁబోవ నొక విశాల

రసాలచ్ఛాయ నమర్పఁబడిన రతనాల పలకలతిన్నెపై నధివే ష్ఠించియున్న హీరాసుందరిని నివ్వెరపు జూడ్కులతోఁ జూచి నాడతఁడు; ఆమె, హస్తమునఁ గొంతెఁగల్గిన మల్లెదండను గ్రు చ్చుచు, నేమరుపాటునఁ బ్రణయగీతికలఁ బాడుచున్నది. అదే తొలిసారి యౌరంగజీ బామెను చూచుట. తొలిచూడ్కులే యాతని నామెయధీనము గావించినవి. శిలాప్రతిమమాడ్కి జే ష్టల దక్కియున్నాడాతఁడు. నిమిషమాత్రమున, హీరాసౌంద ర్యాతిశయ లక్షణమునకు నీగి, చైతన్యమువీడ, యాతని మేను కుంభినివ్రాలెను. ఆహా! యువకులకు యువతీసందర్శభాగ్యము దుర్భరము కానోపు!

2

నూతన యౌవనపురుషావలోకనము హీరాసుందరికిఁ గొంత గగుర్పాటును, భయకంపమునుఁ గలుగఁజేసినది. ఇందు మిశ్రితమై కనుకొనలందు జొత్తిలుచున్నది నునుగారుసిగ్గు. హృ దయమును దుర్భరముగ వేధించుచున్నది మోహము. అది ప్రేమయా?

ఔరంగజీబునుఁ జూచినదై హీరాయుఁ దడవున నాతని సేవతీర్ప నుత్సహించియు లజ్జపడి, రివ్వున సయూఫ్‌ఖానుని భా ర్యచెంతఁజేరి 'అమ్మా! నవరత్నఖచిత కిరీటధారియు, శ్వేతాం బరధరుడును, భానుకోటి ప్రభాభాసమాన స్వరూపుఁడు నగు పురుషుడొకడు మన యంతఃపురోద్యాన వనవాటికను మూర్ఛఁ జెందియున్నాడు,' అని చెప్పెను. వృద్ధయైన యౌరంగజీబు పి

నతల్లి, ఆ పురుషు నౌరంగజేబుగ నెఱిఁగి, పరివారసమేతయై న చ్చోటకుఁ జని, ఔరంగజేబును గాంచి, వ్యాధిగ్రస్తుఁడై యుండె నను భ్రమచే రోదనముచేయుచు, నాతని శిరమునెత్తి సకల శీతలోపచారములఁ జేసినది. కొంతవడి నౌరంగజేబు స్మృతిదే రినాఁడు. పినతల్లి హృదయనాడి సంతోషవీచికలఁ దేలుచుండె ను. ఆతనిఁ గాంచియు నామె

"తండ్రీ! ఇదేటివింత! నీవు మూర్ఛిల్లఁ గారణమేమి? వ్యా ధియా" యని ప్రశ్నించెను.

ఔరం:—'పిన్నీ! నాకు నిజముగ వ్యాధియే; చికిత్సఁ జే యించెదవా"?

పిన్ని:—తప్పక చేయించెదను, ఎట్టిదావ్యాధి?

ఔరంగ:—'పిన్నీ! అయ్యు దీ యుద్యానవనమందలిగ ల కుసుమ పరిమళముచే నంకురించినది. తప్పకవ్యాధి నివారిం పఁజేతువా? నేను రారాజువంటివాఁడను. జవదాఁటవలదు సుమా!

పిన్ని:—'కుమారా! నా యాన గలదు. త్వరగఁజెప్పుము.'

ఔరంగ:—'పిన్నీ! ఇంతదనుక నా చలువరాతితిన్నె న ధిష్ఠించియున్న స్త్రీకుసుమమే లతాశోభితము? అద్దాని నాకిరీట మున గ్రుచ్చినగాని నా ప్రాణము నిలువదుసుమా!'

పినతల్లి యీ పలుకులు వినుటతోడనే విస్మితహృదయ యయ్యెను. భయవిభ్రమములఁ గనుల వెంబడిఁ జిమ్ముచు నామె 'ఆ కుసుమము హీరాసుందరి' యనెను.

ఔరంగ:—'పిన్నీ! హీరా నావ్యాధి నివారణఁ జేయగ లదు. పృథ్విపై మరి యేవైద్యుఁడును నాకు నెమ్మది నొసఁగ జాలఁడు. చేయింపఁగలవా? హీరా నా హస్తనాడిని బరిశీలిం చి, హృదయవేదన నరసి, పాత్రనింపి యౌషధీసుధ నొసగిన నేను జీవింపగలను. లేనియెడల నీపాదముల కడనె'......

'పిన్ని:—సాహసము వలదు తండ్రి! హీరా నీవ్యాధినివా రించుట నాకును సమ్మతమే. కాని, సయూఫ్‌ఖాను మాత్రము మూర్ఖుఁడు, కిరాతుఁడు. షాజహాను చక్రవర్తియన్నను, నీవన్న ను, జులకనగ చూచును. హీరాయందలి నీయనురాగవృత్తాం త మాతఁడెఱిఁగిన మా ఇరువుర ప్రాణముల నాతడు హరించు ను, గాన నీకోరిక నిర్వహింప నశక్తురాలను. అన్యథా తలంప కుము.'

ఔరంగ:—'పిన్నీ! నీవు నిజముఁ దెల్పితివి. వేఱుమా ర్గమున నే నామెను వివాహమాడెదనులే'!

పినతల్లి హృదయము ఝల్లుమనియెను.

3

ఔరంగజేబు విడసిన దివ్యభవనపుఁ జావడియం దౌరంగ జేబును, దివాను వజీరుఖానుఁడును సంభాషించుచుండిరి.

ఔరం:—'వజీర్! సయూఫ్ ఖానునొద్దకేగి, నేను హీరా నుజేపట్టఁ దలచితిననియు, దీనికెట్టి ప్రతిబంధకమును నేను సహింపననియు నెఱిఁగించిరమ్ము.'

వజీర్:—'చిత్తము; ఆతడు సమ్మతింపనియెడల నాతనిఁ దెగటార్చి వత్తును, అనుజ్ఞ.'

ఔరం:—'వలదు, క్రౌర్యమువలదు. ప్రేమవాహినికి నంతరాయము లుండవు; ఆతడు నిర్లక్ష్యించిన, వేఱుమార్గమున్నది. కాని ఆతని కెట్టిహానియుఁ జేయవలదు.'

వజీరు:—'ప్రభూ! శీఘ్రమే శుభవార్తఁ దెల్పెద' ననుచు నాతడచ్చోటు బాసెను.

హీరానుగాంచి, ఎట్లైన నామెతోఁ దనమనోవాంఛ విన్నవింప నుంకించి, సమ్మతిఁబడయఁగోరు నౌరంగజీ బంతఃపురోద్యాన వనమునఁ బ్రవేశించినాడు. ఎప్పటివలెనే హీరా చలువఱాతిన్నెపై కూర్చునియున్నది. వెనుకనుండి, యౌరంగజీబు పావుర మొకదానిని హీరాపై గుఱిఁబెట్టి విసర నద్దియుబోయి యామె భుజముపై వ్రాల, సగము విడివడిన మేల్మొసుఁగంతయు బూర్తిగజారెను. ఆమె తుల్లిపడి వెనుదిరిగి, జూచునంత నౌరంగజీబు ప్రత్యక్షమాయెను. పోవనున్నను వీలులేనట్టి స్థితియందు హీరా చిక్కువడెను. అచ్చోటనే నిలచి ముసుగుదిద్ది, మోముద్రిప్పియున్న దామె. అంత నౌరంగజీబు,

'హీరా!' యని పిలచెను.

నూతనపురుషు డామెనామము నుచ్చరించుటచే శరీర మొకవిధమైన చలనమునకు లోనైనది. కాని, యామె మాఱు పల్కలేదు

'హీ.....రా!'

'.........'

'హీరా!'

'.........'

'హీరాసుందరీ!'

హీరా:—'ఎవరది'

ఔరం:—'నన్నెఱుఁగవా'?

హీరా:—'ఉఁ ఊ'.

ఔరం:—'పురుషుఁడను'

హీరా:—(చిరునగవునను, చిఱుతకోపమునను) 'అట్లా నా! పురుషులైన స్త్రీల శుద్ధాంత మేలజొత్తురు.

ఔరం:—(ఉల్లాసముతో) 'అంతఃపురము' జేరకముందు నేను స్త్రీనైతిని.

హీరా:—'అదెట్లు!'

ఔరం:—'తెల్పెదc గాని—హీరా! చూచితివా; అది గో ఇటు! ఆ జలయంత్రము- ఆహా, ఎట్లునీటినిc గనయుచున్న దో! చూడు, ఆ శిఖరమెట్లు లాకాశకాంతను జుంబనముc జే యుచున్నదో! చూచితివా? ఆ చంద్రుని ప్రతిబింబ మీ సరో వరకాంత యెడియం దెట్లూయల లూగుచుండెనో! కాదా హీరా! ఏమనియెదవు, హీరా!

హీరా:—(కన్నులు మూసికొని) 'నేc బోయెదను'.

ఔరం:—'నా జీవముc గొనిపొమ్ము'

హీరా పోc బోవును.

ఔరం:—'పోయెదవా హీరా! ఢిల్లీపాదుషా కుమారు ని నిర్లక్షించుతువా'.

హీరా:—'అట్లైన మీ రౌరంగజీబు నామధేయులా?'

ఔరం:—'ఔను. ప్రస్తుతము నీదాసుఁడై నాడాతcడు'.

హీరా కనులు మూసికొని, 'ప్రేమకు గొప్ప, కొద్ది యను విచక్షత లేదుకదా!' ఢిల్లీపాదుషా తనయుఁడేడ, అన్యథా శరణార్థినై యున్న నేనేడ? ఆతcడు నన్ను వలచుటేడ! హా దైవమా! ఔరంగజీబునకై నా ప్రాణముల నర్పింతును, నీవే నాసాక్షివి. (పైకి) 'అయ్యో! నే జేయునదేమి'? నే నెందులకు నసమర్థురాలను. క్షమింపుము.'

ఔరం:—'ఈ లోపున నేను మరణింతునేమో'.

హీరా:—(త్రుళ్లిపడి) అయ్యో! ఔరంగజీబ్! నీవు మరణింపవలదు. నే జీవింపఁజాలను'.

ఔరం:—'అట్లైనఁ బాణిగ్రహణ మొనర్పుము.'

హీరా:—'అందులకు సయూఫ్‌ఖాను ననుజ్ఞ కావలయును. మన వివాహమున కాతఁడీయకొనఁడు. నాయాశవీడి పొ'మ్మనుచు హీరా, రివ్వునఁ బిట్టవలె జనానాలోని కేగెను.

'హీరా! హీరా'!

5

హీరా:—'అమ్మా! భవనమున హర్ష సన్నాహములకుఁ గారణ మేమైయుండును'.

సయూఫ్‌భార్య:—'అమ్మా! నూతన బంధువెవ్వరో నిన్న వివాహమాడ నుండెనని సయూఫ్‌ఖాను వార్తనంపెను.

హీరా;—'ఆతఁ డౌరంగజీబగునా'?

సయూఫ్‌భార్య:—'అదెద్దియు నాకుఁ దెలియదు. నిరంకుశుడగు సయూఫ్‌ని యాజ్ఞయనుల్లంఘ్యము గాన, నవ్విషయ మెద్దియుఁ దెలియకయే నిన్ను ముస్తాబుఁ జేయుచుంటిని.'

హీరా కనులవెంటఁ గన్నీరు ప్రవహించెను. తనకుఁ గాబోవుభర్త యెవ్వారైనదియుఁ దెలియరాని యీ ఘోరాస్థాన పంజరమున శారికనై తినిగా' యని వగచుచు 'ఔరంగజీబు నా

ప్రియుఁడు కానియెడలఁ బ్రాణముల విడచెద' నని నిశ్చయించి పెండ్లిదుస్తులలో నొక కత్తిని దాఁచి యుంచినది. వివాహసమయమున హీరా హృదయము హాలాహలము మ్రింగినట్లున్నది. ఔరంగజీబుకాక పరపురుషుఁడు తన్ను స్వీకరించునేమో యనెడి భీతి హృదయనాళముల నంటెను. కాని దైవమామె పవిత్ర ప్రేమతరంగములపట్ల ననుకూలుడై యుండ యౌరంగజీబు నామెపతిగాఁ జేసెను.

తన నిలువున నొక మాలతీమాల ధరించి, యౌరంగజీబు హీరాను సమీపించి, మాల నామె కంఠసీమనలంకరింప దానిని రుక్కొనల నిర్వురు నిలచియుండిరి. నెమళ్లు పురులవిప్పి నాట్యమాడుచు 'ప్రేమవిశ్వకళ్యాణ దాయిని' యని కేక్రింకారముల నొనర్చుచున్నవి. ఆ నాటనుండియు హీరా, యౌరంగజీబు హృదయ వేదిక నలంకరింపుచు సౌభాగ్యవతియైయుండెను.

# మా అత్త చేదస్తాలు.



"అత్తా! నేనేకాని కోటీశ్వరుడనై వుంటే నువ్వుపెట్టిన ఉల్లిఆవకాయకి నోబిలు బహుమానంలాంటిది ఇచ్చివుందు నమ్మా."

అత్త:—నోపిలేమిటా్రి నాయనా? అదేంటి రుద్రాక్ష పూసలా? విభూదిపండా?

నేను:_ ఛీ, కాదమ్మా, నోబిల్ ప్రైజు; నోపిలుకాదు. నోబిల్ అనే ఓమహాపురుషుడుండే వాడమ్మా. అతనుదొర; మంచివాడు. క్రైస్తవ మతంలోవాడు.

అత్త:—(చేతనున్న మడి మంచినీళ్లచెంబు అమాంతంగా జారవిడిచి) అయ్యో! అయ్యో! కుర్రకుంకా,నీకేంవచ్చిందా్రి చేటు? శుభ్రంగా నీళ్లేసుకొ టేసుకున్న మడిబట్ట నిప్పుల్లో కలిపేవు, నాశార్థంపెట్టేవు, మళ్లీనూతిలో నీళ్లెలాపోసుకునేది రా యీచలిలో? అయ్యో నామడికాలా?. (అని రెండుదవడలున్నా చేతితో నొక్కుకుంటుంది.)

నేను:_(ఆశ్చర్యంతో) ఏమమ్మా! ఏం వచ్చింది? నేనేం ముట్టుకున్నానా ఏమన్నానా?

అత్త:—ఉద్ధరి ఇంకాముట్టుకోలేదని అఘోరిస్తున్నావా? బ్రాహ్మడివికావూ? భోంచేస్తూకూడా కిరస్తానీముండా

కోడుకులమాటే చెప్పాలా? నాది మడిబట్టలని తెలీదూ? నేథ వింగ్లీషెలా తేనేం చదివేవు, చదువాలని, నోపిలూనూ సోపిలూన్ను నే నిప్పుడే గోదార్లో దిగేది? యీమాటు తిండితింటూ కిరస్తానీమాట ఎత్తేవంటేచూడు ఏంచేస్తానో. పాౖయశ్చిత్తంచేయించకపోతే "అత్తా" అని పిలవకు.

నేను:—ఏమిటమ్మా అత్తా నువ్వూ? అంతచేదస్తంఅయితే ఎలాగనమ్మా బౖతకడం?

అత్త:—ఎలాగనమ్మా బ్రతకడం అనేదాకావచ్చిందా? ఏమిటో చదుతావేమిటి? బౖతికేదారి చెప్పుతున్నాను తెలుసుకుని మసులుకో. ఈవేళ తెల్లారిలేచి సంధ్యావందనం చేసేవూ? శ్రీసూక్తం పురుషసూక్తం వల్లించేవా? ఏదీ చెప్పు. "గంధద్వారా దురాదర్షాం" ............ పంచాక్షరీ ఒప్పజెప్పేవా నూటఎనిమిదిమాట్లూ? గాయత్రీమంత్రం పూర్తిగా మరచిపోయేవా? హూ. సత్యనారాయణవౖతం చేసుకుంటానని మొక్కుకుని యీ నాటివరకూ చెయ్యలేదు. అంచేతే నీచదువిలా సన్నగిల్లుతోంది. నడిమింటూరి అబ్బాయిని చూడు చక్కగాను, సూర్యనమస్కారాలు, రుద్రాౖభిషేకం చేయందే అసలు బళ్లోకెళ్లడు. అందుకనే పరీక్షలన్నీ సులువుగా పాసవుతున్నాడు. పోనీ యీవేళ శనివారంకాదా ఆంజనేయస్వామి కోవిలకెళ్లి కాయకొట్టేవా? పిశాచం వదిలేను?

నేను:—అత్తా, నీచాదస్తంకాని, నువ్వు చెప్పినతర్వాత

నన్నీ చెయ్యడంలేదూ? ఇవన్నీ చేస్తూంటే నాపుస్తకాలు చదువుకుందుకే లేదు.

అత్త:—దైవసహాయంవుంటే అన్నీ బాగుంటాయి.

నేను:—అన్నట్టు అత్తా దైవసహాయం అంటే జ్ఞాపకం వచ్చింది. ఈ వేళ నాకు దైవసహాయం కొనాలమ్మా మూడు రూపాయలిచ్చి.

అత్త:—దైవసహాయం మూడురూపాయలిచ్చి కొనడం ఏమిటా? కొంటేవస్తాడుటా? దేవుడు? నన్నెందుకురా అలా ఆడిస్తావు?

నేను:—అదికాదమ్మా. దైవసహాయం అని ఓపుస్తకాన్ని అంటారు.

అత్త:—సరే ఇస్తాలే. తిండితిని మరోమాటు ప్రార్థన శ్లోకాలు చదువుకో. "శుక్లాంబరధరం" అవిన్నీ. నేపోయి స్నానంచేసొస్తా.

మాది అసలు చెన్నంగివలస అగ్రహారం. అది మాద్రావిడకుటుంబానికి రాగిశాసనాలతో మూడు నాలుగు తరాలక్రితం విజయనగర మహారాజుల్లో ఒకాయన దానం ఇచ్చేరు. అది దాన్ని దానంఅనడానికి వీల్లేదు. ఏమూ మాపూర్వీకుల్లో ఒక పూర్వసువాసినికి వారుబహుమానపూర్వకంగా ఇచ్చేరు. దేనికంటే, మహారుచికరంగా కొట్టిక్కి బుట్టలుచేసి ఆరాజుగారికి

దాఖలుచేసి నందుకు అంతకిపూర్వం మావంశీయులది పేరూరు దేవాలయంమీద తాసీల్దారుగారి గురాప్రెన్నిక్కించిన శూరుల గ్రామం అదే. అగ్రహారదారు లనిపించుకుని మాపూర్వులు చెన్నంగివలసకి వలసపోయి స్థిరమైపోయేరు. మానాన్న కాపూరి గ్రామకరిణీకం వుందికాని చాలా సాధువవడంచేత కోర్టుల్లోకి అతనిపేరు ఎక్కలేదు. మా నాన్నకి మాఅత్తేచెల్లెలు. ఆవిడకి వివాహం నాలుగోఏట చేసేడుట మా తాత, మామామ్మ మా అత్త పెళ్లి చూడకుండా చచ్చిపోతానని ఏడుస్తే; అయిదోఏట నుండీ మా అత్త పూర్వసువాసి నయిపోయింది. అప్పటినుంచీ మా నాన్న ఆవిడిని అల్లారుముద్దుగా పెంచి పెద్దదాన్ని చేసేడు. ఆవిడ పూర్వాచార పరాయణురాలు, నిష్టనియమంకల మనిషి; అంటే అచ్చతెనుగున చాదస్తంమనిషి అన్నమాట. పూర్వసువాసిని చిన్నప్పుడే అవడంచేత, నిష్టానియమాల్లో మునిగిపోయి, రోజుకి నలభై స్నానాలు, వారానికి అయిదు ఉపవాసాలు, నిత్యం సొజ్జిఫలహారాలు, ఏకాదశవ్రతాలు, చిలుకద్వాదశులు, శివరాత్రులు, కార్తీకసోమవారాలు ఇత్యాదులు ఒక్కటీతప్పకుండా ఇప్పటి తన డభ్భైఏళ్ళయేటివరకు చేసింది, ఇంకా చెయ్యబోతుంది. పుణ్యలోకం ప్రాప్తిస్తుందనే ఆశతో వుంది. కాని ఇప్పటికీ చిల్లరవడ్డీవ్యాపారం మానలేదు. మా అత్త జీవితచరిత్రచూస్తే; భగవంతుడు ఏంచేసినా అనవసరంగా చేయడనిపిస్తుంది. సాధారణంగా మాద్రావిడ కుటుంబాలలో పూర్వసువాసినులైన మేనత్తలుండడం ఒకందుకు మంచిదిగానేవుంది. ఏమా, సంసారం దిద్దుబాట్లలోనూ, చాకిరీచేయడం

లోనూ, వాళ్ల చాకచక్యం, ఔదార్యం, ఓపిక, ఆర్థికమంత్రికైనా వుండవు. అందులోనూ మా అత్త మరీనిపుణురాలు. గంషిడి మా కుటుంబానికంతా తానే స్వయం చాకిరీ చేయటం. మాచిన్నతనాల్లో కుర్రాళ్లందరకీ తలలంటి, చల్దిలుపెట్టి, బట్టలుకట్టి, వంటలువండి, ఫలహారాలుచేసి, బళ్లోకిపంపించి, భజనలకీ హరికథలకీ తీసుకెళ్లి, నానాచాకరీ చేసేది. మాఅమ్మకి పనేవుండేదికాదు. కందా బచ్చలకూడా మిళాయించి కూరవండితే ఆవిడే వండాలి; రెండుపడలాలఎత్తు కూరతింటే మా చొప్పల్లిఅవధాన్లే తినాలి. నేనే ఓ విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలరునవుతే పాకకళాశాఖ నొకదాన్ని స్థాపించి అందులో మాఅత్తని ప్రొఫసరుగా పెట్టివుందును. అప్పడాలపిండి తయారుచెయ్యడానికి మాఅత్తనిచెప్పి మరొళ్లని చెప్పాలి. ఇంక చేగోడీలు, జంతికలు, చక్కిలాలు, చనిపిడివుండలమాట వ్రాయనేఅక్కర్లేదు. ఇంక బజారుకి వెళ్లిందంటే, నలుగురూ రూపాయఇచ్చి పదైనాకొంటే మాఅత్త పదిఅణాలకే తెచ్చేది. అందులోనూ రాచిప్పలూ, తిరగళ్లూ, జాడీలూ, బేరంచెయ్యడం, నాణ్యంచెయ్యడంలో ఏరత్నపరీక్షకుడి తెలివితేటలూ చాలవు. ఇంక చదువుల్లో గీతగోవిందలు, రామదాసుచరిత్ర, చిలుకముగ్గులు, సీతసమర్త, సీతసీమంతం, కుశలవకుచ్చల, సేతుబంధనం, ఇత్యాదిగా కీర్తనలు పదరూపంగా, చన్నీళ్లు స్నానంచేస్తూ, చలికి వణకుతూ పాడిందంటే కిన్నరులు మ్రోగినట్లే. గ్రామఫోను ప్రఖ్యాతిగన్న రామతిలకం, శ్రీరంజినీ ఆమెకి తీసికట్లు. పోనీ ఓ ప్లేటు ఇయ్యవమ్మాఅంటే ఒరే నాయనా, నీకు ఇష్టంఅ

యిన చాకిరీ ఏదైనా చేస్తాను కాని నన్ను పెట్టిమీద పాడమ నకు. పాటాగాత్రిపు తీసుకోమనకు. ఏం మహాబాగుంటుంది ఆ పాట? కీమని కీచు రాయిలాగ. ఏం అందం అని పాటో? వెర్రి తకళతప్పు. అడుగో నడిమింటూడు తీయించుకుని ఒక గొట్టంలా గ నిటాకు నించుచున్నాడు బొప్పాయిచెటు కాడలాగ వళ్లూ వాడూను. ఎండిపోయిన బొప్పాయి ఆకులాగ జుట్టున్నూ. ఇం టూవంటూ లేనిది నాకెందుకురా? "రామా, కృష్ణా అనుకుంటే కాలం వెడుతుంది" అంటుంది ఇంక హరికథల్లోకి వెళ్లిందంటే సీతావనవాసం, ద్రౌపదీవిషాదం, దమయంతీవిలాపం విన్నదం టే, వచ్చిన జనులంతా ఆశ్చర్యపడేటట్టూ, ఏకధారగా కళ్లంట నీళ్లతో ఏడుస్తుంది. తాను ఏడుస్తున్నట్టు నలుగురూ గ్రహిం చేరో లేదోనని ఇటూ అటూ చూస్తుంది. కాని పుత్త చేదస్తా లపుట్ట. అనుమానాల అక్క. పంచాంగం చూడందే దినంజర గదు. శకునంచూడందే పనిచెయ్యదు. జ్వరాలువస్తే పిల్లలకి, చేట బియ్యంవేసి దయ్యంపట్టిందని రక్షరేకు కట్టిస్తుంది. ఇంగ్లీ షువైద్యుడంటే మహారోత. "ఆనోట్లోపెట్టేదిన్నీ, రబ్బరుగొ ట్టంనూచూసి ఉరోసుకుంటూ"నని డాక్టరే వచ్చివెళ్లితే ఆయన వెనకాలే పేడనీళ్లుజల్లి ఇల్లు శుద్ధిచేస్తుంది. రోగికితప్ప ఇంటి ల్లిపాదికీ స్నానాలు చేయిస్తుంది. అబ్బబ్బా! ఆవిడ జీవితంలో యీ అధ్యాయం నాకు చాలా తలనొప్పిగా వుంటుంది. నీళ్లక నివెళ్లి మాఅత్త వీధిలోంచింకా రాలేదేమాఅని చూసే ఓ తె ల్లారుఝామున, సాధారణంగా, రోడ్డుమీద చచ్చటిమైల సో కుతుందనే, నాలుగుగంటల పొద్దుకే ఎంతచలిలోనైనా కుళా

యికిపోయి, ఆకుళాయికి మృత్తికాస్నానంచేసి శుద్ధిచేసి "హరా, హరా" అంటూ స్నానంచేసి, బాగాతోమిన ఇత్తడిబిందెలో నీళ్లుపట్టుకుని" శ్రీరామ జయరామ నారాయణారామ, చింతలెల్లాబాపు నారాయణారామ అంటూ నారాయణస్మరణచేస్తూ వచ్చేసేది. ఒకరోజున ఆవిడ దురదృష్టవశాత్తు ఆవిడకి చచ్చటిది ఎదురైంది నీళ్లు తెస్తూంటే. పట్టరానికోపం వచ్చిందావిడకి. "ఆవీధిని పోవేలంజముండా" అని బిందెలోంచి చారెడునీళ్లుతీసి రోడ్డుని జల్లుకుంటూ నించుంది. "ఆపక్కనించిపోతాను నిలూఅమ్మా" అంది చచ్చటిది. "ఛీ, నీమొహంకాల్చెయ్యా,మడే" అంది. "ఆ......మడి, మడి, మడి, మడిఅయితే రోడ్డెందుకెక్కేవూ. ఆవీధంట నువ్వోపో" అని విసరున చచ్చటిది ఆవిడపక్కనించే వెళ్లింది. "అయ్యో నీమొహంతగలెయ్యా, నీమొగం మంటెట్ట, నీకేం పోయికాలమే, నీకేంచేటే, మీదకొస్తున్నావూ, నీఇల్లు నాశనంఅయిపోనూ, నీఇల్లు గుల్లఅయిపోనూ, నిన్ను దేవుడెప్పుడెత్తుకపోతాడో" అని తిట్లు ఎక్కాలుచదివి ఆబిందెడినీళ్లూ రోడ్డుమీదపోసేసి మళ్లీ తెచ్చుకుంది కుళాయిలోంచి. చచ్చటిది యీవిడతిట్లకి ఉడుక్కుని" ఏటీ యీబాపనమ్మనోరూ...గానుగలాగ... హి-హి అని పళ్లిగిలిస్తుంది. యీఅమ్మనోరుచూసే, యీఅమ్మ ఆచారంచూసే కావాలమొగుడు చచ్చేసినాడు. అని పెద్దపులిలా అరుస్తూ పోయింది. యీచిత్రింవింటూ చూస్తున్న బడిపిల్లకాయలకి కొంత నవ్వులాటగావుండి, ఆచచ్చటిదాని మాటలే పలుక్కుంటూపోయేరు.

విజయనగరంలో నాహైస్కూలు చదువుకి మా అత్తే నాకు గార్డియను. ఆవిడకట్టుదిట్టంలో జాగ్రతగా నుంటానని ఆశపడి మానాన్న ఆవిడనిచ్చి పంపేడునన్ను. నోటిమంచిచేసుకునో, చెయ్యి అసరాఇచ్చో, హెడ్డుమాష్టరుగారింట్లో బాలసారెకి బూర్లపిండి వంటచేసి పెట్టోవచ్చి మా అత్త "నాన్నా, నీకు ఫీజుకాలరీ తెప్పించేనా్రి" అంది. మొదట అదేమిటో నాకర్థం కాలేదు. ప్రశ్న పరంపరలవల్ల తెలిసింది 'స్కాలరుషిప్' అని సంతోషించేను. పరీక్ష ప్యాసవడానికోసూత్రం చెప్పింది ఆవిడ. అది చదువుసుంత్రంకాదు. నిత్యరుదాభిషేకాలూ, తిరుపతిమొక్కులున్నూ పరీక్షరోజుల్లో తనముఖం చూడనిచ్చేదికాదు లేవగానే; అందుకని ప్రత్యేకంగా పొరుగింటి కన్నెపిల్లని ఆ వారంరోజులున్నూ దగ్గరపడుకోబెట్టుకుని తెల్లవారగానే ఆ పిల్లచేత నన్ను లేపించేది. ఆవిడకూడా జపంచేసి; తులసినీళ్లు నాకిచ్చి "నాయనా, రోజూ యీనీళ్లు తాగుతూవుండు, పరీక్షఅవుతుంది"అనేది. "అత్తా, యీచాదస్తాలతో కాలం వెళ్లబుచ్చుతే చదివేదెప్పుడమ్మా?"అంటే" ఏం భయంలేదు. దేవుడిమీాదా నామీాదా పడెయ్యి ఆభారం. అదిగో వాళ్లబ్బాయి, రాత్రనక, పగలనక, తిండనక, తిప్పలనక, తెగచదువుతాడు. ఒక్కనాడైనా భగవంతుడనడు; దేవుడూ దయ్యంలేని యీా చదువెందుకురా. అందుకనే ముమ్మాటు ఫేలైనాడు మెట్టుక్కలేట్టు. నాయనా, నీకెప్పుడేనా కుడికన్ను అదురుతుందిరా". "ఆ పరీక్షరోజుల్లో అదురుతుందత్తా." "ఆ సరే అయితే పరీక్ష ప్యాసవుతావు, నాకూ రోజూ

ఎడంకన్ను బెదురుతూనేవుంటుంది. ఆడవాళ్లకి ఎడమ, మగా ళ్లకి కుడీ మంచిదట - నాకేం ఆశా, చేటా, కానుపా, గడ్డలా. నాకోరికల్లా నీవు పాసవడం, మాఅత్త నన్ను ఓ గట్టుకు చేర్చిం దని నువ్వు అనుకోడం, కావాలి అంతే." అంది ఇలాంటి వ్యక్తి పేజాపెత్తంలో పెరిగిన నాకు చిన్ననాటనుంచీ ఆపెడ చాదస్తా లు నసాళానికి అంటుకుపోయి అక్కడ కాపరం చేసేయి. చదు వుమీద దీక్షతగ్గింది. దైవభక్తి హెచ్చింది. అంతా ఎందుకు? పరీక్ష ప్యాసవడానికి మాఅత్త మహిమో, నాభాగ్యమో, నే పూజచేసిన దేవుడివరమో కాని పరీక్ష అయినాను స్కూలుఫై నలు మానాన్న చాలా సంతోషించి ఓ జత బూట్సు కొనిఇ చ్చేడు. సైకిలు కావాలన్నాను. ఎఫ్. ఏ. పాసయితే నిస్తాన న్నాడు. సరేనని విజయనగరం అత్తతోవచ్చేసి కాలేజీలో ప్ర వేసించేను. మంచిరోజూ, మంచినక్షత్రం, మంచితారాబలం, చంద్రబలం, వర్జదోషాలూ, ఇత్యాదులుచూసి మరీ మాఅత్త నన్ను కాలేజీకి ప్రవేశంరోజున పంపింది. దేవుడిమీద భారంవే సి పాసయినాననే ధీమాచేత రెండుసంవత్సరాల చదువూ వెన క్కిపెట్టేను. పూజాపునస్కారాలకి అగ్రస్థానంఇచ్చేను. మాఅ త్త ప్రబోధంవల్ల కొత్తగా భగవద్గీత, సుందరకాండపారాయ ణా ఆరంభించేను. రోజూ నాకు మంచి కలలు వచ్చేవి, కృష్ణు డు కనిపించినట్టు, ఆంజనేయస్వామి కనిపించి 'శ్రీరామరక్ష' ముద్రనిచ్చినట్టున్నూ. అత్తతో చెప్పేవాడిని. "నేను చెప్పే నుకాదటూ, యీమాటుకూడా పాసవుతావు" అంది. ఆనాటి మంచీ నాకు కుడికన్ను అదరడం, మాఅత్తకి ఎడమకన్ను. అద

రడంను. అప్పుడప్పుడు ఆవిడకి ఆసలింతలువచ్చి, వాళ్ళతాత, చచ్చిపోయి అప్పటికి పదిసంవత్సరాలైంది, ప్రత్యక్షంఅయి చె ప్పుతూండేవాడుట; 'ఒసేపిల్లా' పిల్లాడికోసం బెంగపెట్టుకున్నా వు కాబోలు, ఏమీాపరవాలేదు, వాడిపరీక్ష పాసవుతుంది పస్టు గా" ననేవాడుట. నాకూ ధైర్యంగానేవుండేది. ఒకనాడు మ ధ్యాహ్నం భోజనానికి కాలేజీనుంచి వచ్చేస్తున్నాను. మాఅత్త, పొరుగింటినుంచి, గదితాళం కొంగునగట్టి భుజంమీాద పడేసుకు ని నెమ్మదిగా తిరిగివస్తోంది. మేమిద్దరమూ ఇల్లు ఒకేమారు చేరేం. ఆవిడ తలుపు తెరచింది. టప్పుమని బల్లిఒకటి ఆవిడ ఎ డంభుజంమీాద పడింది. తుళ్లిపడిచూసి బల్లిరా, ఎడంభుజా న్నపడింది, ఆడాళ్లకి ఎడంభుజం శుభం; నువ్వు తప్పకుండా పరీ క్షఅవుతావు. మీానాన్నచేత నాకు గౌరవంవస్తుంది" అంది. పంచాంగం తిప్పిచూసేను, బల్లిపతనానికి ఫలంఏమిటా అని. 'సంభోగం' అని వ్రాసివుంది. మాఅత్తభుజంమీాద బల్లిపడితే ఇదెలాసమర్ధించుకోవడమో తెలియలేదు; అది నాకెలా అన్వ యిస్తుందో అంతకంటే బోధపడలేదు. అయితే, వృద్ధవాక్యం వేదవాక్యం అని మాఅత్త చెప్పిందే నిజంఅని నమ్మేను.

కొన్నాళ్లయింది; పెద్దపరీక్షలు దగ్గరపడ్డాయి. అత్త తో చెప్పేను. ఆవేళనించి భగవద్గీతా, సుందరకాండ మూాడేసి మార్లు పారాయణచేయించేది. తులసినీళ్లిచ్చేది, జపంచేసిన తసతావళం నాకు ముట్టించేది, సరస్వతీపీఠానికి నాచేత మందా గపూలు వేయించేది. పరీక్షరోజుల్లోనూ ఇంతే. నాకు రోడ్డు మీాద మంచి శకునం అవాలని ఇద్దరు కన్నెపిల్లలని జాగ్రతచే

సి, వాళ్లని గుమ్మంలో కూచోబెట్టి, నన్ను చూడగానే ఎదురు
గా రమ్మనేది. తుమ్మలు వినపడకుండా జేబురుమాలు కొసలు
చెవుల్లో పెట్టించేది. వారంరోజులూ పరీక్ష సవ్యంగా జరిగింది.
బాగా వ్రాసేను. "పరీక్ష పాసవుతాడ్రా అన్నయ్యా," అని
అత్త మా నాన్నతో చెప్పేసింది. తర్వాత తెలిసినసంగతేమి
టంటే, ఆవిడ నాపరీక్ష పాసవడానికని సత్యనారాయణవ్రతం,
తిరుపతికొండకి ప్రయాణం, దీపారాధన, ఆంజనేయులుకి పాల
బిందెలు, చేయిస్తానని మొక్కుకుందిట కూడాను. మా అమ్మ
చేత అందుకనే నిత్యశనివారాలు చేయించిందట. ఇంతలో పే
పర్లో చదివేను, ఒకరోజున పరీక్షలు తెలుస్తాయని. అత్తనిపిలచి,
"అత్తా! రేపు నాలుగ్గంటలకి పరీక్షలు తెలుస్తాయటమ్మా మన
ఊళ్ళో." అన్నాను.

అత్త:—నువ్వు పాసయినావురా వెర్రిడ, కంగారపడ
కు. రేపు మీఅమ్మచేత నిన్ను పక్కమీదనుంచి లేపిస్తాను.
భోజనంఅయేక, చూడూ, మన దేవాలయం గర్భగుడిలోకూ
ర్చుని దీక్షగా ధ్యానంచేసుకో. మడిబట్టకట్టుకో. ఉత్తచేతు
ల్తో వెళ్లకు. జారీనిండా నీళ్లుపట్టుకెళ్లు. బ్రాహ్మణలక్షణంఅది."
అంది. మాఇంట్లో మాఅత్తమాటకి ఎదురుచెప్పడంఅంటే పు
లినోట్లో పడ్డట్టే. మాఅత్త మాకో ముసోలినీలాంటిది. అంచేత
ఆవిడ ఆజ్ఞప్రకారం ఆరోజు గుడిలోకి వెళ్లేను. వెళ్లేముందు
గుడిగంట మ్రోగింది. ఆవేశంతో అత్త "జయం, జయం" అం
టూ నన్ను ముందుకి గెంటింది. నాకూ ధైర్యమేకలిగింది చె

ప్పొద్దూ మరి. ఏమో, నాకూ ఆశ్శే కాదూ పాసంటేను. "శకునంకూడా తలవని తలంపుగా మంచిదైంది సడసరా అబ్బాయీ" అని నన్ను తరిమింది. పేపరు పట్నాన్నుంచి తేవడానికి మా మేనబావని సైకిలిచ్చి పంపేను. అతడూ బి. ఏ. పాసయిన వాడే. అతనికోసం ఎదురుచూస్తూ మా అత్తా, నాన్నా, గుడి అరుగుమీద కూచున్నారు. నేను లోపల గాయిత్రీస్థవంనూ, సరస్వతీస్తోత్రంనూ చేస్తూవున్నాను. కాస్త సేపటికి సైకిలుగంట వినపడింది. నాగుండె దడదడ హెచ్చింది. నేనూ అరుగు ముందుకివచ్చే. మా అత్త మా బావని సమీపించి "ఏమిరా, కుర్రాడి నంబరుందా" అంది. మా నాన్న ఆతృతగా చూసేడు. సైకిలుదిగి, వేలవేసిన మొహంతో బావ. "కనిపించలేదు పిన్నీ" అన్నాడు. "ఛా! నీ మొహం, లేకపోవడం ఏమిటి, వెర్రిపెద్దమ్మారా. వాడిది వుండకపోతే ఎవరిది వుంటుంది?" అంది. నాలో ప్రాణం లేదు. గుడిలోంచి పైకివచ్చి పేపరు చూసేను. "ఏమిరా" అంది అత్త. "లేదమ్మా" అన్నాను. "ఇద్దరూ గుడ్డిమాలోకమే. యూభ్రాసులు. వెధవ చదువు చదివేరు. అంతకనిపించదుట్రా? ఎందుకొచ్చిన బి.ఏ. రా నీది? అలా వెర్రిమొహాలేసుకుని చూస్తూవుండకపోతే మన ఊరికరణంగారికైనా చూపించి రండి. ఆయనకేనా కనబడుతుందేమో" అంది అత్త. "నీకు చాదస్తమా ఏమిటక్కా. కుర్రాడు క్షౌరం చేసేడు" అన్నాడు మా నాన్న. "అదేంట్రా తమ్ముడూ, వాడిలాగెవరు కష్టపడ్డార్రా. అయ్యో, ఎన్నెన్ని పూజలూ, పునస్కారాలు..." అంది అత్త. "అదే నా కొంపముంచిందని" మా అత్త మీద విసు

కున్నాన్నేను. "ఒరే, ఒకవేళ నీనంబరు మరచిపోయేవేమో రా. లేకపోవడం ఏమిటిచిత్రం" అంది అత్త. నాకూ అనుమానం వేసి పెట్టెలో హాలుటికెట్టు తీసిచూసేను. నేను మొదటఅనుకున్న నంబరే. "ఒరే, ఎవడో నీమీదకిట్టక నీమార్కులు తగ్గించేసేడ్రా. లేకపోతే, అంకెలుకూడ్డంలో తప్పుపడివుంటారు. కనుక్కోకూడదూ" అంది మాఅత్త.

"ఊరుకోవమ్మా నీచేదస్తం మరీని" అని గదిమేడు మాబావ. "అలాకాక్కాదుగ, ఆదిద్దేవాడికి పిల్లలులేరురా? గొడ్డువాడా? తనపిల్లలకైతే వేసుకోడూ? పీడిమార్కు లెవరికైనా వేసేసుంటారు. నాకు తెలుసు" అంది అత్త.

"అదంతా ఒట్టిమాట. పీడిపారాయణాలే పీడినింతమట్టుకు తెచ్చింది. నీకు మల్లేనే చాదస్తాలకుంక అయిపోయినాడు. ఈ మాటుశుభ్రంగా చదివి వెళ్లమంటాను ఏ ఇతరచింతా లేకుండా" నని మా నాన్న కోప్పడ్డాడు. మా అత్త చిన్నబోయింది. నాకు భయం, సిగ్గూ వేసింది.

కొంతకాలం అయేక నేనొక్క డినీ విజయనగరంలో ప్రైవేటుగా చదువుకుని, పరీక్షకిమాత్రం విశాఖపట్నంలో కట్టేను. అప్పటినుంచీ నా ఎడమకన్నూ, ఎడమభుజం అదరజొచ్చేయి. జ్యోతిష్కులు నాజాతకంచూసి మూతివిరచేరు. నేను జంకలేదు. టర్నరుసత్రంలో మకాంపెట్టేను. తెల్లవారగానే మా అత్తలాంటిమనిషే నా గదికెదురుగా స్నానంచేస్తూం

డడం నేను చూడడం అయేది. అపశకునం అని భీతిపడలేదు నేను. తెల్లవారితే పరీక్ష. రాత్రిచదివి పండుకుని, అయిదు గంటలకే లేచి బయటకి వద్దామని తలుపుతీసేను. నా ఎదురుగా ఒకమనిషి నించుని, "బాబూ, క్షౌరంచేసుకుంటారా" అని అడిగేడు. మొదట నాకేమో అపశకునంలా కనిపించి నా ఆమాట తర్వాతమనసు స్థిరంచేసుకుని నిర్భయంగా వున్నాను. ఆ సత్రంలో మంగలాళ్లెప్పుడూ అలాగే కనిపెట్టుకుర్చుంటారట. ఏమైతేనేం, పరీక్షరోజులల్లా ఆ మంగలాడి ప్రథమదివ్యదర్శనంతోటే అయినాయి. పరీక్షహాలులో అడుగుపెట్టనో లేదో, వాచరు భళ్లునతుమ్మేడు. నాకు నవ్వొచ్చింది. పరీక్షల్లో బాగావ్రాసేను. పాసయినాను. ఘనతఅంతా తనదిగానే సంతోషిస్తుంది మాఅత్త ఇప్పటికిన్నీ. నన్నొక ఇంటివాడినిచేసి, ఇందరు మొగపిల్లలతోనూ, ఇందరాడపిల్లలతోనూ, సరదాగా నేను ముచ్చటలాడుతూంటే చూడాలనే ఆశతో జీవించివున్నానంటుంది ఇంకా మాఅత్త. రామేశ్వరయాత్ర నావల్లనే జరగాలనే పుట్టెడాశతో చూస్తోంది ఆవిడ. ఏమవుతోందోమరి.



# ప్రేమగానము.

బృందావనంలో శ్రీకృష్ణుడు చిన్ననాట గొల్లపిల్లలతో సూర్యోదయానికి ముందు చల్దిమూటలు చంకనేసుకుని గొల్ల కాపరితనం చేసిన తియ్యాటి దినాలవి; రోజుకో విచిత్రం చూపిస్తూ, సృష్టికర్త మైకూడా తనవిచిత్రప్రదర్శనాలని గారడీవాని మల్లే మాయతనంగా వెల్లడిచేసిన మధుర మధుర సమయాలవి; ఇతరప్రపంచం అంతా తనజీవితవైభవంకాసి అఘోమయం గా, అమాయకంగా, తేరిపారిచూసి నిశ్చేష్టమై, నిజంఅల్లా కల్లగానూ, కల్ల నిజంగానూ అనుమానించి భ్రాంతిచెంది వుండగా, తనని చుట్టిముట్టి ప్రేమవర్షాన్ని ప్రవహింపజేస్తున్న గొల్లభామలకీ గొల్ల బాలురకీ తనమురళీగానమాధురిని, తన ప్రేమగానాన్ని, రవంత రవంత చవిచూపిస్తూ మురిసి, మురిపించి, తన భగవత్సాంప్రదాయానికి పురాణేతిహాసాల్లో ప్రేమస్వరూపం నీటుగా గోటుగా అల్లజూచిన అపూర్వఘడియలవి. అప్పట్లో, ఒకనాటి పున్నమరేయిని బృందావన పరిసరాన్ని దట్టంగా పెరిగివున్న అరణ్యంలో శ్రీకృష్ణుని చెలిమికాడు సుధాముడున్నూ, శ్రీకృష్ణుడున్నూ, ఓ లేతమామిడి గున్నమీద కూర్చునివుండగా, కృష్ణుడు, మొల్లకొద్దీబలసివున్న ఆవనం అంతా తనప్రేమగీతికలో తన్మయమయేటట్టు, చలనంలేని సుషుప్తిలో ప్రేమపుష్పాల చిగురిస్తూ వాటితో నాతని ప్రేమమూర్తిని పూజచేసేటట్టు, మురళి నీల వేసివేసి, కొంతతడవకి దానిని పెదవి

మండి జారవిడచి పరధ్యాన్నంగా దిక్కులు చూసిచూసి చిన్న గద్గదికతో సుధాము నుద్దేసించి,

"సుధామా! చెప్పేనని ఏవగింపక, రాత్రిసమయంకదా అని సంశయింపక, నీవుపోయి ఆరాధని తీసుకువస్తూ, నీకు పుణ్యాంవుంటుంది" అన్నాడు.

సుధా:—కృష్ణా, నే చెప్పిందేదీ నీకు నచ్చదుకదా. ముప్పొద్దులా ఆ మురిపింపుముద్దరాలు రాధనే తలుస్తుంటావు కాని, ఒక్కక్షణమైనా ఆవిడ నిన్నుతలుస్తుందా? నిన్నకాక మొన్ననే కాదటోయ్ నువ్వు దేవుళ్లాడుతున్నావని బెదురుగా రాధమ్మ ఇంటికిపోయి నువ్వెందుకో రమ్మంటున్నావని నేనుచెప్తే, తలదువ్వుకుంటూ నాకేసి ఓమాటు ఇలాచూసి, గిర్రున మొగం వెగటుగాపెట్టి అటుకాసి తిరిగి కూచుని, అద్దంలోసహా నాబింబం కనబడుతుందని దాన్నికూడా చాటునపెట్టేసుకుంది. నీపైన నాకుగల ప్రేమచేతేకాదూ, అంతనిర్లక్ష్యం చేసిన రాధనీ, చీవాట్లుతింటూనే రమ్మని రమ్మని బ్రతిమాలుతే, నాకాసైనా చూడకుండా, పంజరంలో తనచిన్నారిచిలుకనిచూసి "చెల్లీ, చూసేవే కృష్ణుడి దుడుకుతనం? ఆయనగారక్కడ సింగారించుక్కూచున్నాడుట, నన్నేమో రావలసినదిగాయీనిరర్థక నాముడైన సుధాముడ్ని పంపేడు. ఏం; ఒహాళ్లనిపంపుకోకపోతే తానేరాకూడదూ? ఏం పనిమించిందని? గొల్లభామలకి నీళ్లోసి తలలోపువ్వులు ముడవడమేకాదూ? నేను రానని చెప్పుతున్నాను" అంది. దానికి సమాధానంగా, ఆచిలుక

ఎన్ని మాటలు నేర్చిందో, అందికదా, "అక్కా! అతడ్నివూరిం
చి వూరించి పరుగెట్టుకొచ్చిందానికోసం అలాపలవరిస్తూంటే,
ఓసారి పోకూడదూ?, నీది స్త్రీహృదయంకాదూ? ఆమాత్రం గ్ర
హించలేవూ?" అని దూషించింది. "ఓసి నీసిగ్గుచిమడా, ను
వ్వూ కృష్ణునిపక్షమే మాట్లాడుతున్నావా. బ్రహ్మాదులువచ్చి
నాసరే, శ్రీకృష్ణుడు స్వయంవచ్చి నన్ను బ్రతిమాలు తేనేకాని
నేనుపోను. చూద్దాం ఎవరిపంతం నెగ్గుతుందో. స్త్రీహృదయం
అంతచులకనదికాదు" అంది. "మొగాడివికాదా నీకుమాత్రం
ఆ పౌరుషంలేదూ. పదేపదే వార్తలు పంపుతావు. అంతగా
వుండలేకపోతే నీవేపోదూ బాబూ నన్నుచంపక."

శ్రీకృ:—సుధామా! రాధగర్విష్ఠేకాని, ఆమెపవిత్ర
త నీవు గ్రహించలేవు. ఆమెనెలాగైనా రప్పించేపన్నాగం ప
న్నేనుకాదూ. ఇకమళ్లీ పంపన్లే. యీఒక్కమాగూ పోయి
రా. దానిపనిపడదాం. మరోవిషయం చూసేవూ? రాధచేత తి
రస్కరింపబడి నువ్వువచ్చేసేక రాధ నాకోసం ఎంతగా పరితపిం
చిందో నీకేం తెలుసు? స్వభావంచేత పంతగొట్టి అవడంచేత
పట్టునెగ్గించుకోవాలనే సంకల్పమేకాని, తనకి నాపైన ప్రేమ
లేకనా?

సుధా:—అది నిజమే. రాధాకృష్ణుల పవిత్రప్రేమైక
జీవితం యుగములతరబడి మానవకల్యాణానికీ, ప్రేమమయమై
న యీ జగత్తు సౌభాగ్యానికీ ఎంతలుగా పరిణామము నొందగ
లదో వూహామాత్రాన గ్రహింపవచ్చును. కాని కృష్ణా! నీకు

నీవైనా, రాధ పైదోడులేకనే విశ్వకల్యాణానందగీతిక నేడైనా అల్లి నీ పవిత్రప్రేమతత్వాన్ని ప్రబోధించరాదూ? ఏమూ? స్త్రీ స్వభావం పంతానికి పదునెక్కుతుంది. పిలుపున బిరుసువారుతుంది. నీకు నేచెప్పేవాడినా ఏమిటిలే?

శ్రీకృ:—సుధామా, నీవు చెప్పిందంతా నిజమే. ఎట్టి సంకల్పానికైనా సమయాసమయాలున్నాయి. ముందు గాధ నిగెలిచి మనపంతం నెగ్గించుకోవాలి. విశ్వకల్యాణానందగీతిక అవసరమైనప్పుడు అల్లుతానులే. నీకూ వినిపిస్తానది. వేగిరంవెల్లి ఆరాధని తీసుకురా. తనులేని యీ పున్నమరేయి వెన్నెల నాకెంతేని అగ్ని వేండ్రముగా నుండును. తెలతెలవారునపుడు కోకిలపాడే ఆ మధురమధుర గానము నాహృదయానికెంతేని వేదనగా వుంటుంది. ఆమె నాదగ్గర లేనిదే నా మురళిపైకి వేళ్లు చంగున పర్వొత్తుకపోవవోయ్; అందులోనూ ఒకవేళ అపస్వరంకూడా రావచ్చునేమో. ఆ చల్లతనానికీ, ఆ తీయదనానికీ, సుస్వరానికీకూడా స్త్రీ స్వభావం కావాలి. అది లేనప్పుడు పరిమిళహీనమైన పుష్పంలాగ నైసర్గికగుణం ఒకటి లోపించిందన్నమాటే. అబ్బా! యీ సృధాప్రసంగం ఎందుకు? పోయి, శరవేగమేపోయి రాధను తీసుకురా. రాకపోతే ఒట్టుపెట్టినానని చెప్పు. తెల్లవారువరకూ ఇక్కడనే నిరీక్షించుతూవుంటాను.

సుధా:—కృష్ణా! నీమాటకి నేనెప్పుడూ వ్యతిరేకంచెప్పను. కాని ఒకటిసుమా. రాధమ్మ రానని నాకిచ్చిన బహుమతులు నీకే ఒప్పగించుతా చూసుకో.

శ్రీకృ:—అబ్బా! అట్టే అశుభం పలుకకుసుమా. చూడూ, మరోవిషయం. ఏకారణంచేతనైనా రాధ రానంటే- కీడెంచి మేలెంచాలి కాదూ- నాకోరికగా, తన మెడనలంకరించుకున్న మేలుముత్యాలహారంలో ఒక్కముత్యం నాకిమ్మనిచెప్పు. దానికి వేయింతలుగా మళ్లీ ముత్యాలుపంపుతానని చెప్పు. జయంచేసుకువచ్చేవో చూసుకో నీకు నేనిచ్చే బహుమతులు. ఇక వెళ్లు.

౨

రాధఇంట్లో. బాగా అలంకరింపబడిన పందిరమంచం మీాద రాధ పడుక్కొని దీర్ఘంగా ఆలోచిస్తూంటుంది. "ఆడదానికి పంతం ఏమిటిలేకపోతే. స్త్రీ వుత్త బేల. ఆత్మీయుడు దగ్గరవుంటే ఎంతైనా బిరుసుతనం వస్తుంది తన స్వభావానికి. నెగ్గిందా, సర్వసామ్రాజ్యానికీ తానే అధికారి. ఆత్మీయుని హృదయసామ్రాజ్యంకూడా తనకి స్వాధీనమే. కర్మించాలక అపజయంకలిగిందా, ఆ స్త్రీకి కలిగే నగచాట్లు చెప్పవీలులేదు. ఆత్మీయుడు వంచనచేసి తనపట్టు నెగ్గించుకుని విజయుడౌతాడు. అప్పుడు ఆమెకి ఎంత ప్రాణసంకటంగానేనా వుంటుంది. ఆత్మీయుడు చెంతలేనప్పుడు, ఆమె స్వభావంలో బేలతనం పొడసూపుతుంది. ఆ బేలతనంలో నామె ఆత్మీయునికి మానసికంగా సుస్రూషలుచేసి ఆత్మార్పణం సంపూర్ణంగా చేస్తుంది. కానీచూదాం. శ్రీకృష్ణుడు నా పాదాక్రాంతుడు కాని మాటకదా. సుధామునివార్త తనకి మెడలువిరిచినట్టే వుంటుంది. అలాగే అయితే అతనింకా ఇక్కడికి రాకపోవడమేమి? ఆగ్రహం

వచ్చిందా! అయ్యో ఎంతపనిచేసేను. అనుగ్రహపూర్వకంగా, ప్రార్థనపూర్వకంగా రావలసినదని వార్త నంపిన ప్రియబంధువు నకు ఆగ్రహం కలుగజేసిన పాపాత్మురాలనై తినే! ఎంత కఠినం పూనేను ఆర్ద్రస్వభావుడైన నాకృష్ణునిపట్ల? ఎంతలుగా పలవరిం చేడో నాకోసం. చిన్ననాటి చనువుచేతనేకదా అంత ధైర్యంగా రావలసినదిగా వార్తపంపేడు? అనలేక అనలేక రాననేసేను. ఇప్పుడెంతవిచారించినా ఏమిలాభం? అదీకాక కృష్ణుడంటే నా కెందుకీవాంఛ? కోరకనే, విరోధంవహించియేకూడా, ఆ ప్రేమ మూర్తి మూర్తివంతంకానే నా హృదయం తోంః కల్పించుకు పోతుంది. ఆ మూర్తి నిచ్చలూ నాఎదుటనే నృత్యంచేస్తూనే వుంటుంది. అట్టివానిపట్ల నేను గర్వించి పంతంపట్టేను. రాడా! చూతాం. ఏమది? రథధ్వనిలావుంది! కృష్ణుడే. నా కృష్ణు-కృ ష్ణు-కృష్ణుడే.'' అని కలవరపాటుతో వలువ సవరించుకుని కిటికీ నుండి తొంగిచూస్తుంది రాధ. కాని కృష్ణుడు కానరాడు. "భ్రమ" అంటూ పడకచేరి కృష్ణుని తలుస్తూ వెక్కి వెక్కి ఏ డుస్తుంది. ఓటమిఅంటే పౌరుషంగావుండి తానై కృష్ణుడిదగ్గర కి పోవడానికి ఒప్పుకోదు. జయమే కావలసివస్తే శ్రీకృష్ణునికి దూరమైపోతోంది రాధ. ఏమా, ఆవిడకంటె పంతగొట్టె పెంకి కృష్ణుడు. ఇంతలో తలుపుతెరచుకుని సుధాముడు వస్తాడు.

సుధా:—రాధమ్మా, రాధమ్మా.

రాధ:—యీ దౌర్భాగ్యుడు మళ్లీ వచ్చేడు. కృష్ణుడే

వచ్చియుండిన నాపంతం నెగ్గకపోయేదా? శకునిపక్షి, వీడుఎప్పు డూ మనకి అనుకూలుడుకాడు.

సుధా:—రాధమ్మా, రాధమ్మా, శ్రీకృష్ణుడు నీకు వార్త పంపేడు.

రాధ:—నీపనివార్తలు మోయడమా ఏమిటి? నీకుసి గ్గులేదూ? ఏమిటా వార్త, మహావార్త, అయినా?

సుధా:— ఏమీలేదూ, నిన్ను రమ్మనమన్నాడు. దగ్గ రవుండి తీసుకురమ్మన్నాడు. నువ్వులేకపోతే తోచదుట.

రాధ:— ఇంక దయచెయ్యి. వార్తచెప్పడం అయిం దా? నేనురానని చెప్పు. ముమ్మాటికి చెప్పు రానన్నానని.

సుధా:—ఒట్టుపెట్టమన్నాను కూడాను.

రాధ:—తనఒట్లు ఏమిసత్యమని? యీ ఒట్టుతో నూట ఒక్కఒట్టు వృధాఅయిందని చెప్పు. తనేవస్తానని ఒట్టుపెట్టుకు ని ఎంతగావచ్చేడో కనుక్కో. తానురాకూడదా?

సుధా:—తీరికలేదుట. నీపేర ఉద్యానవనం వేయిస్తు న్నాడు. అది చూదువుకాని. రా.

రాధ:—(పులకరించి, హర్షము వెలిబుచ్చే మోమును ముసుగులో మరుగువెట్టి) నాకునూ తీరికలేదు. నాచిలుకకి తన పైన గీతికలు నేర్పుచున్నానని చెప్పు.

సుధా:—రాధమ్మా, నువ్వురాకపోతే భోజనంచెయ్యడుట, మురళి వాయింపడట.

రాధ:—ఏమిటి కవిత్వం చెప్పుతున్నావు? ఇన్నాళ్లు ఏమైంది ఆదీక్ష? పో అవతలకి. నేను రానని చెప్పు.

సుధా:— తల్లీ, మీకు దండంపెడతాను, నాగురించైనా ఓమారువచ్చి వెళ్లుదూ.

రాధ:—(లేనికోపంతో మంచం దిగి సుధాముడి చెవులునులిపి) పిశాచంలాగ వదలవేమి? నా పేరుగా మీ కృష్ణుడి చెవులుకూడా ఇలాగే నువ్వునులిపి, నే రావడానికవసరం లేదన్నానని చెప్పు. అంతగా రావాలనంటే తన నేరమ్మను. పాపం, తనకి రావాలనేవుంటుంది కాని గొల్లమ్మలతన్ని వదులూరా? ఇంతటిపరాధీనత పనికిరాదని నేను గర్జించేనని చెప్పు. ఇంకామాటలాడితే.........

సుధా:—(వీధిలోకి పర్వెత్తిపోయి, మళ్లీ తప్పటడుగులతో నెమ్మదిగా రాధ గుమ్మంచేరి) రాధమ్మా, ఇంకొక్కమాట వినేసిపో.

రాధ:—(లోనుండే) ఏమిటది? వీధిలోంచే ఘోషించు.

సుధా:—మరి, కృష్ణుడేం, నీమెడలో ముత్యాలపేరుందీ? దానిలో ఓముత్యం, నీకిష్టమయింది ఒక్కటే ఇమ్మన్నాడు. యీమాటు నిన్ను చూడడానికి వచ్చినప్పుడు అలాటివి వేలకొలదిగా మళ్లీ ఇస్తానని చెప్పమన్నాడు.

రాధ:—నాహారాల్లో ముత్యంఅడగడానికి తనకేం హక్కుంది! నేనీయనని చెప్పు. ఇలాటి తుంటరితనంచేస్తే బాగా జరగదని చెప్పు.

సుధా:—రాధా, ఇయ్యవూ?.

రాధ:—ఇయ్యను.

సుధా:—నీకృష్ణుడికే కాదూ. అతను నీదగ్గరవుంటే అస్తమానం ఒళ్లోకూచోబెట్టుకుని ముద్దు పెట్టుకుంటావు కాని, ఒక్కముత్యం ఇస్తేనే అరిగిపోతావా?.

రాధ:—(మందహాసంతో) గవాలున తలుపు తెరచి సుధాముని నెత్తిమీద మొట్టికాయ మొట్టి గెంటుతుంది. సుధాముడు పారిపోతాడు.

సుధాముడు గుమ్మందాటి పోయిందే తడవుగా రాధ విశేషమైన విషాదాన్ని అనుభవించింది. శ్రీకృష్ణుని కంటిలోని పాపలాగ తాను అతనిహృదయంలోనే సంచరిస్తున్న విషయానికి ఎంతగర్వించినా, ఎంతఉప్పొంగినా, అతనిపిలుపు నంతనిర్లక్ష్యంచేసినందుకు తనకి తానే సమ్మతిపడలేదు, తనకి తానే క్షమించుకోలేదు. ఇక శ్రీకృష్ణుడా క్షమించేది? ఆనాటితో తనకీ కృష్ణుడికీ ఋణానుబంధం తెగినదనే విచారించింది. శ్రీకృష్ణునిపేర తన హృదయాన్ని అర్పణంచేసినతర్వాత తనకే అధికారమేది అతనిమీద? ఒకమారు తన హృదయకవాటపు బీ

గాన్ని మురళీధరునిచేత బెట్టినతర్వాత నాకవాటాన్ని బంధించుటకుగాని తెరచుటకుగాని తన కేమిస్వాతంత్రమున్నది? తాన ర్పించినది పవిత్రప్రేమ, నిష్కళంకమైనప్రేమ, అతీతమైన ప్రేమయేకాని తుచ్ఛమైన, నీచమైన, భోగలాంఛనమైన ప్రేమ కాదే! అటువంటిసమయాన తనప్రేమపై తనకి నిరంకుశత్వమెక్కడిది? అయ్యో, స్త్రీయే, తనపవిత్రతచేత, పురుషునికి తనసర్వస్వము నర్పించుచున్నది. పురుషుని వ్యక్తిత్వంలో తానూ ఛాయమై, ద్వంద మేకాని వ్యక్తిత్వాన్ని పొంది "ప్రేమ" అనే మహాతేజస్సునకదానిని భూనభోంతరాళాల్లో వ్యాపింపజేస్తూంది. అది అగ్నిహోత్రము. అగ్నిహోత్రానికి అపవిత్రత లేదే! అయితే తనప్రేమమాట? దానికినీ అపవిత్రతాదోషం లేదే! అయితే శ్రీకృష్ణునిపిలుపు నేల నిర్లక్ష్యంచేసింది? తమ అనురాగాన్ని గాఢానురాగంగా చేయడానికి. నిష్కళంకమైన తనప్రేమని పరమోత్కృష్టంగాచేసి దినదినాభివృద్ధిగా పోషించడానికి. ఇరువురి ప్రేమికులనడుమ సరళమైన, సహజమైన, సారసమైన, భావగర్భితమైన ఇట్టి ఎడబాటు, ఇట్టి పంతగింపు, ఇట్టి కలహాలు వుండుటలో కలశోభ, ఉత్సాహము, స్వేచ్ఛ, నిగారింపు, స్త్రీ పురుషునిపట్ల దాస్యతవహించినదానిలో లేదు. మొదటిదే ఉపచారము. రెండవదే అపచారము. అయినంతమాత్రాన శ్రీకృష్ణునిలో తనపై ద్వేషభావం జనింపచేయడం ఏమంత తెలివైనపని? కాదు. కాని, వారిపోటీ శారీరకంకాదు. మానసికం; అంతేకాకుండా, అదొక ప్రేమపరీక్ష. పీరువారిలో నేవిశేషమైన అభిమానమున్నదన్నమాట. ఇదే శ్రీకృష్ణుడుగ్రహిం

చకున్నాడా? గ్రహించి తాను తనవద్దకి రాడా? ఇదీ రాధధీమా. అయితేమి? స్త్రీకి సహజగుణమైన బేలతనం రాధని నిరుత్సాహపరచింది. తన దుండగీడుతనానికి కఠినంగా దూషించుకుంది. మానసకల్పితంఅయిన శ్రీకృష్ణమూర్తివంతానికి క్షమార్పణ సాష్టాంగాలు చేసింది. కాని, ఒకవేళ కృష్ణుడాసమయాన, తనఎదుట సాక్షాత్కరించివుంటే రాధమూతి బిగించి బింకంగా కూచుని బ్రతిమాలించుకునేదే. ప్రాణంపోయినా క్షమార్పణ జోహార్లు తానుపెట్టదు సరికదా కృష్ణుడినే అలా చెయ్యమంటుంది. అదీ స్త్రీ స్వభావం. అంతసున్నితమయినదేదీ ప్రపంచంలో లేదు. "ఆ దేవదేవునికి ఆత్మార్పణం చేసినదాన్ని, ఒక్క ముత్యం ఇచ్చినానుకానే" అని విలపించింది. పక్కమీదవాలి, "కృష్ణా! రావా!" అని ఎలుగెత్తి ఏడ్చింది. "ఒక్కముత్యమేమి, హారమంతా తీసుకో"మని ప్రార్థించింది. కాని ఎంతజేసినా కృష్ణుడు రాలేదు తనదగ్గరకి. తనపై తనకే ఏవగింపుకలిగింది. హారంఅంటే అసహ్యంవేసింది. దానిని నేల నురివ్వి ముక్కలుగా పగులగొట్టింది, "కృష్ణునికి కాని భూషలు నాకేల"నని. అతనివద్దకేపోయి తన తప్పిదం ఒప్పుకుందునాఅని గుమ్మంవరకు వెళ్లింది. ఒక్కగంతువేస్తే కృష్ణుని సాక్షాత్కారమయ్యేదే. కాని పంజరంలో చిలుక, సహజమైన తన మధురవాక్కుతో హేళనచేసింది. "అక్కా! ఓటమి నీదే"నని. యీ పలుకు లామె కర్ణములకి శూలాలయ్యాయి. లోనికిపోయి భళ్లున తలుపుమూసుకుని, చిలుకని తిడుతూ, తనని తిట్టుకుంటూ, పడకమీదవ్రాలి శాంతంగావుందామనుకుంటే, చి

లుకే కృష్ణునిమీద గీతాలుపాడుతూ ఆమెని మరింత కళవరపె ట్టింది. "కృష్ణుని కలలోనైనా చూస్తానుకాని అక్కడకి నేను పోను" అని సంకల్పించేసుకుంది రాధ.

3

అక్కడ సుధాముడు శ్రీకృష్ణుని చెవులునులిపి రాధ ప్రత్యుత్తరాన్ని తెలియజేసేడతనికి. రాధని రప్పించితీరుతాన ని శపథంపట్టేడు శ్రీకృష్ణుడు. ఆమెవద్దకి మళ్లీ వార్తమాత్రం పంపలేదు.

యశోద:—తండ్రీ, ఏమమ్మా అలావున్నావు? ఏంకా వాలినాన్నా? పాలుకావాలా? రథం కొనమన్నావా? మురళికి ఇంకా అలంకారాలు కావాలా? ఏమిటి? చెప్పు. అడిగిందే త డవుచే యిస్తాను. అని శ్రీకృష్ణుని తనదగ్గరకి లాక్కుని వెర్రి గా ముద్దెట్టుకుంది.

కృష్ణు:—నాకు ఏమీవద్దుకానీ, అమ్మా, ఓ చిన్నగ మ్మత్తు అడుగుతాను ఇస్తావా?

యశోద:—తప్పకుండా. నీకుకాదని ఎవరికిస్తానోయ్?

కృష్ణు:—నాకాముత్యం కావాలి. నీచెవులికి వేసుకు న్నావు, దానిలో ఒకముత్తెం ఇయ్యమ్మా. మళ్లీ ఇచ్చేస్తాను. ఇంకా మంచివికూడా ఇస్తాను.

యశోద:—ఓసీ, యీ మహాభాగ్యానికేనా తండ్రి,

యీ ప్రార్థన? దానికేంభాగ్యం? ఒకటికాదు. అన్నీ తీసుకో. ఇంకా కావాలంటే పెట్టెలోవికూడా తీసుకో. నీకు కాదనేవారెవరయ్యా?

కృష్ణుని ముఖపద్మం వికసించింది. మాతృశ్రీకి కృతజ్ఞతా వందనాలర్పించి తనకికావలసిన ముత్యం తీసుకుని ఇటూఅటూ దాన్నితిప్పి చూసి, సంతోషంతో వీధిలోకివెళ్ళి నించున్నాడు. కుర్రాడు ఏం చేస్తాడో అని ఆతృతగా చూస్తోందియశోద. భూమిలో ఓచిన్న కన్నంచేసి అందులో యీముత్యం పాతిపెట్టేడు చిన్నికృష్ణుడు. తల్లిచూస్తూ నేవుంది. తనయుని అమాయకత్వానికి జాలిపడింది. ముత్యం విలువ తెలియక తానట్లు చేస్తున్నాడనుకుని,

"కృష్ణా, అదేంపనీ. ముత్యం పాతిపెట్టుతున్నా వెందుకు? నన్ను గమ్మత్తుచేయడానికా? అబ్బే, పాడై పోతుందమ్మా! తీసెయ్యి." అంది.

కృష్ణుడు చిరునవ్వు నవ్వి కళ్ళల్లో సుకుమారంనూ, గడుసుతనాన్నీ సూచిస్తూ ఊరుకుంటాడు. ఇలాంటినవ్వూ, ఇలాంటి చూపూ, యశోదకి వింతదృశ్యాలుకావు. అనేకపర్యాయాలు ఇలాగే నవ్వి అద్భుతాలని చవిచూపించేడు తనకికృష్ణుడు. యశోదకి ఎప్పుడు కోపంవచ్చినా తానేమీ సమాధానం చెప్పక నవ్వుతాడు. అందులో గూఢార్థం ఎంతేనావుంది గ్రహిస్తే. సత్యాన్ని మాయనుంచి తప్పించే సామర్థ్యంకలాడు.

కాబట్టే ఆయనలాంచేసేవాడు. నిత్యమైనప్రేమచేత అనిత్యమైన మాయని ఎన్నోమాట్లు ఖండించేడాయన. అప్పట్లో యశోద ఇంకా కోపగించుతే ఏవిశ్వరూపప్రదర్శనమో దివ్యంగాచూపి తనతత్వాన్ని వెల్లడిచేసేవాడు. ఆ తత్వానికి సమస్తప్రపంచమూ జోహారిడి, అలవర్చుకుని, ధ్యానించింది, ధ్యానిస్తోంది. యీమాటుకూడా ఆ తత్వాన్నే మారువిధంగా వెల్లడిచేసే సంకల్పం కనపరచేడు కృష్ణుడు. ఈ మహత్తరకార్యానికి భంగం కలుగజేసేశక్తి మూడులోకాల్లోనూలేదు. మాతృప్రేమకి కూడా ఆధాటిలేదు. ఆశక్తి ఒక్క శ్రీకృష్ణునిలోనే వుంది. దానివినియోగం ప్రళయకాలంలోనే కాని, సృష్టికి తత్వోపదేశం చేసేవాడుకాదు. దానికి ఆచార్యుడు తనే. తనబుడుతని యీ ఆచార్యత్వం కూసింతేనా గ్రహింపలేని యశోదసహా, కృష్ణుడు ముత్యాన్ని భూమిలోనాటి దాన్ని మహావృక్షంగా కల్పిద్దామనే సంకల్పం ఒకపిచ్చిచేష్టగానూ, కుర్రతనపు టాటగానూ మాతరమే గ్రహించింది. అతడు నాటినబీజము ఏ అమూల్యమైన ముత్యమో, అదెట్టిమహావృక్షముగా పెరిగి ఎట్టిపుష్పాలనీ, ఫలాలనీ పూచి కాచునో అని సర్వప్రపంచమూ నోరు తెరచుకుని సంభ్రమాశ్చర్యాలతో చూడవలసినదైనది.

"అమ్మా! ముత్యం నాటేను. అది క్షణంలో ఓ మహావృక్షం అయిపోతుంది. వచ్చిచూద్దూ" అన్నాడు కృష్ణుడు.

"ఓయి వెర్రినాయనా, ముత్యాన్నినాటుతే చెట్టవదమ్మా. అదేం విత్తనపు గింజఅనుకున్నావా!" అంది యశోద.

కృష్ణుడు:—వచ్చి చూద్దూ, అబ్బా.

"మావాడు ఉత్తిచిచ్చివాడు. ఎప్పుడూ ఏదో గడిబిడచేస్తూనే వుంటాడు. ఏదోయి, వచ్చేను; చెట్టుచేసి చూపించు చూస్తాను నీప్రజ్ఞ. నేనేం వెర్రిదానిననుకున్నావా నీమాటనమ్మడానికి ?" అంటూ యశోద, కృష్ణుడు నిలుచున్న చోటు సమీపించి నించునివుంది. అతడు మొలనుండి మురళిపైకితీసేడు. "అమ్మా, నా ప్రేమగానానికి జీవకళ చిమ్మని చేతనాచేతన పదార్థ మీలోకంలో లేదమ్మా" అంటూ మురళి బంగారుకట్లు సవరించేడు. దానికొనలను కట్టిన మువ్వలని గిలగిలా మోగించి, తన పద్మనయనాలని ఆకాశంకాసి ఎత్తి, మెల్లగా, సాలోచనంగా తనముద్దుచేతులతో మురళిని తనలేతగులాబిరంగుగల మోవిపై మోపి, తనపిల్లపాదాలతో లయవేస్తూ, అద్భుతగాన కౌశలప్రదర్శనంలోకి దిగేడు. అప్పట్లో సతని సౌందర్యమూర్తి సకలానందకర మూర్తివంతం అయింది; భక్తిచేత ఉన్మాదం కలిగినవారికి శాంతినిలయమైంది: జ్ఞానోదయంచేత ప్రతాపవంతులైన వారికి దివ్యజ్ఞానప్రసాద మందిరమైంది. అప్పట్లో తనగానము, అదృష్టవంతులైన తనచెలికాండ్రకు ప్రేమసుధాపానమైంది; మహర్షులకు జ్ఞానామృతపానమైంది. చైతన్యవిహీనమైన వృక్షజాలములకు నసాధారణమైన చైతన్యస్ఫురణ స్ఫురించుటచేత, తమంతటతామే నిజస్థితినిమరచి, గీతములకి తగిన నృత్యముచేసే ప్రతిభ నలవచ్చుకున్నవి. ఆ గానము సమస్తలోకాలకూ వ్యాపించింది. అజ్ఞానతిమిరంలో కొట్టుకు కొట్టుకుని విషాదంతో జీవయాత్ర సలుపుచున్న జనులంతా మేల్కొండి,

మేల్కొండి, మీ జన్మలు తరించే సమయంవచ్చింది. మీఅజ్ఞానం నిర్మూలనమయ్యేవేళ కావచ్చింది అన్నట్టుగా ఏదో శ్రావ్యమైన స్వరమువిని, ఒక్కుమ్మడిగా తుళ్లిపడి శ్రీకృష్ణమూర్తి వంతం కాసి ఆకర్షింపబడి రివ్వున పర్వెత్తివచ్చేరు. ఆ బాలగోపాలంను. కృష్ణుడు మహాసమాధిలో తన్మయుడై నిశ్చేష్టతగాంచిన ఓ మహాజ్ఞానసంపన్నుడి మల్లె, తన గానసమాధిలో లీనమై, చైతన్యంలేనట్టుగా, మధురమైన, సరళమైన, సకల శోభాయమానమైన గీతికల నొకటి వెంబడి నొకటి నూత్నకళలతో తదేకదీక్షగా పాడుచున్నాడు. ఆ పాటలో సర్వప్రపంచమూ లీనమైపోయింది. ఆ మాధుర్యానికి తన్మయత్వం పొందింది; ఆ సరళభావానికి సౌభాగ్యత గాంచింది. దానినుండి పొంగి, పొరలి ప్రవహించు ప్రేమసాగరంలో జలకమాడింది; ఆ అచేతనత్వంలోనె ప్రేమబద్ధాంజలినీ మహాగాయక శిఖామణికిచ్చింది. గొల్లపడుచులు తమ శరీరములపై స్మారకంవీడ్వచ్చి, నృత్యంచేయ నారంభించేరు; గోవులునూ లేగలు లేకనే స్తన్యంచేపేయి; నానావిధజాతుల పక్షులు ఆతనిపాటనే ప్రతిధ్వనింపఁజేసేయి; మోడులైపోయిన వృక్షాలుసహా ఆపాటకి నూతనపాటవం దెచ్చుకుని చిగుర్చి, పుష్పించి, ఫలింపనారంభించేయి. కఠిన కఠిన శిలలుకూడా ఆ గానమహిమకి కరగిపోయి సెలయేళ్లయినాయి; నాగులు తమ బిలములనుండి కుటుంబాలతోవచ్చి పడగలెత్తి ఆడేయి; అజ్ఞానులు జ్ఞానులైనారు; జ్ఞానులు మోక్షసౌఖ్యాన్ని చవిచూసేరు. యశోద తనస్థూలవీక్షణాలతోనే యీ మహాసౌభాగ్యం కనులారచూసి తననోముఫ

లాని కొక్క ఆనంద యశ్రువును భగవద్దివ్యసందర్శన భాగ్యమునకు నుత్సాహజోహారునూ ఇచ్చింది. మరొకగీతిక, మరొకగీతిక. కృష్ణుడునాటిన మేలుముత్యం గంభీరమైన శబ్దంతో పగిలింది; దానిగర్భంనుంచి చిన్న మొలక లేచి, భూమిని బీటలు చేసుకుని, పైకితోసుకువచ్చి ఆమురళీగాన మాధురిలోని యమృతాన్ని తానూ తనివికొలది తాగి తాగి, ఉబ్బెత్తుగా పెరిగి పెరిగి మహావృక్షమైంది. సొగసైన వర్షంపడింది. ప్రపంచంఅంతా మేల్కొని చూసింది. వృక్షం, ప్రతిశాఖనీ అసంఖ్యాకముగా చిరుతముత్యాలని తొడిగింది. మురళి మోగుతూనేవుంది. మరొకగీతిక మందమలయ మారుతము వీచింది. వృక్షంకదిలింది; చిరుతముత్యాలు వర్షబిందువులమల్లె జలజలా రాలేయి. సర్వప్రపంచమూ దోసెళ్లతో నేరుకుంది. తనివిచాలక గోపికలు వక్షస్థలాలపై హారాలుఅల్లుకుని, ఇంకాతనివినొందక దోసిళ్లతో వాటిని తాగి తాగి సంతోషస్వాంతులైనారు; ఒక్కమ్మడి మురళి ననుసరించి ప్రేమగీతిక పాడేరు. అదే నేటిశాశ్వతమైన భక్తిగీతిక, ప్రణయగీతిక. దానిఆకారము హృదయాహ్లాదంలోవుంది; దానిజీవము హృదయంలోనే స్థాపించబడింది. ఇదే ప్రేమగానము.

తన పాన్పుమీదనుండి వింది రాధ యీపాట, తనమనస్సులో విచిత్రమైన మాధుర్యం పొడసూపింది. కన్నువిప్పి సర్వప్రపంచాన్ని తేరిబారి చూసింది. అంతటా మహాతేజస్సాగటి అపురూపమైన రూపసంపదతో నిండివుంది. దాని సౌందర్యరాసిలో ఘనీభవించిన ప్రత్యేకతగాంచి ప్రేమాంజలి నిచ్చిం

దిరాధ. తనలో ప్రేమ పిపాసనుద్భవింపజేసే కృష్ణగీతికలవిండి. హృదయము బరువెక్కింది, శాంతినిలయ మాసించింది. తలుపు తెరచి మురళి వినవచ్చిన దెసకి ఉన్మాదినివలె పర్వెత్తింది. "కృష్ణా, కృష్ణా, కృష్ణా" అంటూ బృందావనం సమీపించింది. తనకన్న ముందుగ సమస్తలోకాలూ ఆప్రదేశానికి వచ్చివున్నాయి. తానే ఆలస్యంగావచ్చిన వ్యక్తి రంగంలోకి. తన హృదయకవాటం తెరచి స్థూలసూక్ష్మదృష్ఠులతో నొకేసారి సర్వం విలోకించింది. విశ్వరూపప్రదర్శకుడు, ప్రేమస్వరూపుడు, విశ్వకల్యాణప్రదాయియగు శ్రీకృష్ణుడిని చూచింది. అతడు జగదాధారుడై, జగన్నాటకసూత్రధారుడై మహాశక్తిస్వరూపుడై దేదీప్యమానంగా తేజరిల్లుచున్నాడు. సమీపించింది రాధ అతనిని; కౌగలించుకుందికృష్ణుడిని. ఉప్పొంగినాడు కృష్ణుడు. ఇనుమడించిన ఉత్సాహంతో మురళీనాదం చేసేడు. శక్తిస్వరూపిణిగా రాధని, శక్తిసహాయుడై సర్వప్రపంచకల్యాణానికీ ఆధారభూతమైన మహావ్యక్తిగా శ్రీకృష్ణుని పూజ చేసింది భారతావని. భారతమాత పావనిఅయి తన తనయుల మహాదృష్టమున కెంతయు సంభ్రమపడి, తన స్థైర్యస్వరూపంగా వారికి ఔన్నత్యమూ, ప్రేమతత్వమూ, వీరావేశమూ పంచిఇచ్చి, యావత్తుమానవకోటికీ మాతయై శోభగాంచినది. భారతమాతా, నీకు ధన్యవాదములు. నీకు మాప్రణామములు. నీకు మహావిజయము నాదేవదేవుడు ప్రసాదించుగాక.

యశోద:—కృష్ణా! కృష్ణా, చాలునయ్యా నీప్రదర్శనం. నేనికచూడలేను.

కృష్ణు:—అమ్మా, నీముత్యము నీకిచ్చి వేసినానా?

యశోద:—ఆఁ. అదేకాదు. ఇంకా వేనకు వేలిచ్చినా వయ్యా. నేను ధన్యురాలను. నీప్రేమగానము చవిజూచి మా నవులందరూ, సృష్టిలోని సమస్త జీవులునూ ధన్యులైనారుతండ్రీ.

కృష్ణుడు మందహాసము చేస్తాడు. సర్వప్రపంచమూ, తన యదార్థస్థితికి మరలింది. ముత్యపుచెట్టుమాత్రం ఆచోట నే స్థిరమైయుండి, శ్రీకృష్ణుని గానాన్ని స్మరించుకుంటూ వుం డిపోయింది. దీని సంస్మృతివలెనే శ్రీకృష్ణుడు కురుక్షేత్రంలో భగవద్గీతని ప్రబోధించేడు మానవులకు. అదీ ప్రేమగీతికయే.

రాధ శ్రీకృష్ణుని మోలనేనిలచి, శిరస్సునూ, గడ్డము నూ నిమిరి, "కృష్ణా! నీవే గెలిచితివి. నేనే ఓడితిని. అంది."

కృష్ణు:—రాధా, నాతో పంతగించిన వేరుగానగునని తలచితివా?......కాని నిజస్థితి నీకుమాత్రం తెలియకనా. నీ మూలముననైనా యీ ప్రపంచమునకు నాయీ ప్రేమగానము చేత శాశ్వతమైన సుఖమును, శాంతిని ఇయ్యదలంచి నేపన్నిన ప్రణయకలహమే కాని, మనకు వైరమెక్కడిది? నేగెల్చినగె లుపు నీదిమాత్రముకాదా!"



# బొమ్మల కొలువు.*



నాన్నా బొమ్మలు తెచ్చేవా?

లేదమ్మా! రేపు తెస్తాను తల్లీ.

ఎప్పుడూ అలాగే అంటావుకానీ రోజూ రేపు రేపం టావు.

రేపు తప్పకుండా తెస్తానుకాదూ.

అందరూ బొమ్మలు పెట్టుకుంటున్నారూ - నాకో బొమ్మైనాలేదు. నాకు కృష్ణుడిబొమ్మలూ, రైలుబొమ్మలూ, మారి, మోటాకారులూ, ఇంకా ఏంటే అమ్మా, అదోలాగ వుంటుంది, ఇంత వుంటుంది, కడుపునొక్కితే కీచుమంటుంది, వాళ్లింటో చూసేం.

అమ్మ—దొరసాని పిల్లబొమ్మా! కొని తెస్తాకులే.

బిడ్డ—ఆ! అది. ఇంకా - అన్నీ తే నాన్న - ఎంచక్క చిన్నకొలువు పెడతాను. పేరంటాళ్లని పిలుస్తాను.

నాన్న—అమ్మా! ఇలారా! ఓ చిన్న ముద్దియ్యి. వెర్రితల్లి. వాళ్లింటోలాంటి బొమ్మలు మనకెలా వస్తాయి? వాళ్లు గొప్పవాళ్లు. మనం......

---

* జ్యేష్ఠమాస "భారతిలో" ముద్రింపబడినది.

అమ్మ—అబ్బా ఊరుకుందురూ. దానిక్కూడా చెప్ప డం ఎందుకు కుసగోడనలు. సరేసమ్మా అంటే తీరిపోయె. దాన్నేనా సంతోషంగా వుండనీండి.

బిడ్డ—మనంకూడా గొప్పవాళ్లమే నాన్నా. మరి నువ్వ బొమ్మలు తెత్తావుకాదు.

నాన్న— తెస్తానమ్మా. పోయి ఆడుకో (ముద్దుపెట్టుకుని పంపించేస్తాడు.)

భార్యాభర్తలు వెర్రిమొగాలతో నొకరినొకరు చూచుకుంటూనే కళ్లంట నీళ్లు కారుస్తారు. ఒకళ్లకళ్లు ఒకళ్లుతుడుచుకుని ఓదార్చుకుంటారు. అతను నిరుద్యోగి - ఆస్తి సున్న. బంధువులు చేరనియ్యరు. రోజులెలా గడుస్తున్నాయో పెరుమాళ్లు కెరుక. వారు తిన్నా మానినా, వాళ్ల బిడ్డలకిమాత్రం నేటివరకూ పస్తుమాత్రంలేదు. పిల్లలు భోంచేస్తేనే వాళ్లకి కడుపు నిండేది. ఒకరి పొట్టలో ఒకరు ఇరుక్కు పడుక్కుని ఆకలిమ్నుచ్చలి కెడ మాయకుండా కాలక్షేపం చేస్తూవుంటారు. "శ్యామా! ఇలా ఎన్నాళ్లు" అంటా డాయన. వేడినిట్టూర్పె సమాధానం.

"ఇంత విశాలమైన భూమిలో మనకి తావులేదంటూవా? భూమి సన్నగిలిపోయిందంటూవా?"

"మనలాంటివా ళ్లెందరో" అంది శ్యామ.

"ఏమైనాసరే మన ప్రేమ మరొకరికి ఉండదేమో"

"మనకి ఉన్నది. అదే నా సౌభాగ్యం. ఒహాళ్లమాట నా కెందుకు" అంది శ్యామ.

పండుగ. ప్రపంచ మంతా కలకల్లాడుతోంది. శ్యామలరావుఇల్లూ కళగానేవుంది. తప్పేలామాత్రం కాళీ. అయినా కలకలకి కారణం? వారిబిడ్డల కలకలనవ్వే. అంతా ముచ్చటగా పంచభక్ష్యపరమాన్నాలూ భుజిస్తారు. శ్యామలరావుగారిం ట్లో పస్తు - పిల్లాది పస్తు - ప్రపంచం అంతా బొమ్మలకొలువుతో నిండివుంది. శ్యామలరావుగారింట్లో - మహాలక్ష్మిపీట - మట్టి ప్రమితి - నూనెదీపం- అంతే.

"యీవేళమాటేమిటి?" అన్నాడు శ్యామలరావు.

"పరమేశ్వరుడే శరణ్యం" అంది శ్యామల.

"వీధిలోకి వెళ్లివస్తాను. వేగిరం వస్తాను. వీలైతే మార్వాడీదగ్గర ఖాతాలు వ్రాసి ఒకరూపాయేనా తెస్తాను" అంటూ వెళ్లేడు శ్యామలరావు.

"నాన్నా బొమ్మలు. బొమ్మలునాన్నోయ్" అంది కూతురు.

"మరచిపోలేదమ్మా" అన్నాడాయన.

మార్వాడీ పండుగ చేసుకుంటున్నాడు. రూపాయలకి పూజ. కొట్టుకట్టేసేడు. శ్యామలరావు ఆశ అడుగంటింది. ఊ

రల్లా తిరిగేడు. పండుగపూట రూపాయలు మార్చమన్నారు. దీనుడై ఇంటికి రాబోతున్నాడు. "నాన్నా బొమ్మలు" అన్న మాటలు వినిపించేయి. బిడ్డమీద ప్రేమ ఉరకలు వేస్తోంది. రి ప్పున బజారుకు మళ్లేడు. చిల్లిగవ్వైనా లేదు జేబులో. కుమిలి పోయినాడు. వ్యర్థంగా ఏడ్చేడు. కఠినుడైనాడు. తప్పుఒప్పులు తోచలేదు. యీ వెధవప్రపంచానికీ, ధర్మానికీ బలాదూర్ అ న్నాడు. బిడ్డకి ఒక్క బొమ్మైనా ఇయ్యలేని యీసన్నాసిది వ్యర్థపుబ్రతు కనుకున్నాడు. "నేడే నా ప్రథమతప్పిదం ప్రారం భం - నేడే అది ఆఖరుతప్పిదం" అన్నాడు. కండువా చిరుగు మ డతల్లో కప్పి, కండువాతో షర్టుచిరుగుకప్పి, డాబుగా బొమ్మల దుకాణాలదగ్గరకి వెళ్లి, మహా కొనేవాడిమల్లేనే బేరంచేస్తూ స మయంకనిపెట్టి దుకాణాని కోబొమ్మచొప్పున సంగ్రహించేడు. ఆరుబొమ్మలు దొరికేయి. చాలని తిరిగివస్తున్నాడు. "మా త ల్లి సంతోషిస్తుంది, ఆడుకుంటుంది, చిన్న చిన్న చేతుల్తో కొ లువు పెడుతుంది. మాకు ఆకలిపోతుంది, ఇదే మా పండుగ" అని అనుకుంటూ రాబోతూంటే—

"ఆగు బద్మాష్ - చోరీ చేసేవా?" అన్నాడు బీటుక నిస్టేబు. శ్యామలరావు నిశ్చేష్టుడైనాడు. మాట్లాడకుండా ఆ బొమ్మలు కనిస్టేబు చేతుల్లో పోసేడు. అతను శ్యామలరావును లాకప్ (Lock up) లో వుంచేడు.

అధికారి పార్థసారథి విచారణచేసి శ్యామలరావుకి రోజులు విడిశిక్ష వేసేడు.

"ప్రథమతప్పిదం, క్షమించండి" అన్నాడు శ్యామల రావు.

అధి:— ౪ రోజులు చులకనఖైదు వేసేను, అనుభ వించు.

శ్యా—బిడ్డమీాద ప్రేమచేత చేసేను. భార్య, బిడ్డలు తల్లడిల్లుతూంటారు. ఇంట్లో బియ్యం లేవు. కనికరించి విడిచి పెట్టండి.

అధి :—నీవంటిబిడ్డలతండ్రులు చాలామంది వున్నారు. ఇంట్లో బియ్యం లేనప్పుడు ఇంటికి వెళ్లి ఏమి అఘోరిస్తావు? పండుగై తేమాత్రం? పస్తే కాదూ. హాయిగా ఇక్కడే బాగుం టుంది. యీా నాల్గురోజులూ చక్రవర్తిగారి అతిథివైనావు.

శ్యామ—ఆలు, బిడ్డలతో పడిన పస్తు నాకు పెద్దవిందు గా వుంటుంది. ఇల్లాలు నాకోసం పరితాపంపొందుతూ ఉంటుం ది. రక్షించండి. ఎన్నడూ చెయ్యను.

పార్థసారధికి యీామాట లెంతో ఆశ్చర్యం కలిగించేయి. వారంత అన్యోన్యమైన దంపతులేనా అని అతనిఆలోచన. శ్యా మలరావుమాట లతనిహృదయానికి శూలాలలాగ తగిలి, వెన క తాను హింసపెడితే, తనపోరుపడలేక లేచిపోయిన తనభార్య రుద్రిమ్మమాట జ్ఞాపకంవచ్చి, "నీకు ఖైదులోవిందు; నాకు ఖైదుకంటె అర్థాన్నమైన హాంటల్లోవిందు. మనం ఇద్దరం ఒక్కలాగే ఉన్నాంలే, పడివుండు" అని వెళ్లిపోయేడు.

శ్యామలరావుని నిలువెల్లా అగ్నిముట్టి దహిస్తోంది. ఆలుబిడ్డలు కలలోలాగ కనుపించుతున్నారు. "హా! శివా! శరణు! శరణు భవా" అని అప్రియత్నంగా తననోటివెంట దీనాలాపాలువచ్చేయి. కొయ్యలాగవుండి తెప్పరిల్లి చూసేసరికి-శ్యామా, బిడ్డలు వచ్చివున్నారు అక్కడికి జరిగిన సంగతంతా తెలుసుకుని. శ్యామ ఏడుస్తోంది. శ్యామలరావు దుఃఖంఆపుకున్నాడు. బిడ్డ అమాయకంగా "నాన్నా! బొమ్మలు తెస్తానని చెప్పి ఇక్కడ కూచున్నావా? ఛీ! పోనీలే. బొమ్మలూలేవూ, కొలువూలేదు" అంది. యీ మాటలకి భార్యాభర్తల గుండెల్లో బల్లేలు పొడుచుకుపోయేయి. శ్యామలరావు భార్యకి జరిగినవృత్తాంతం చెప్పేడు. నాలుగురోజుల్లో వస్తాను, ఇంటికివెళ్లండి. వస్తూవడుతూ బ్రతికివుంటే మిమ్మల్ని చూస్తాను. లేకపోతే మీతోపాటే నాకు దారి " అన్నాడు. కనిస్టేబు తొందరపెడుతున్నాడు. శ్యామ కదలనంటుంది. ఖైదు తలుపుల్లోంచి బిడ్డని అందుకుని చేతులుమాత్రం ముద్దుపెట్టుకుని "ఇంటికివెళ్లు తల్లి, వస్తాను" అన్నాడు శ్యామలరావు. "ఇప్పుడు రా" అంది. "అప్పుడే రాను, పనిచూచుకువస్తా" నన్నాడు. "నువ్వు రాకపోతే నేను వెళ్లా" నని గుమ్మంలో కూచుని కూనిరాగాలు తీసిందిబిడ్డ. శ్యామలరావు, శ్యామ ఆపిల్ల నిష్కళంకమైన ప్రేమ, అమాయికత్వం చూచి, ఏమిచేయాలో తెలియక పెద్దపెట్టునేడ్చారు. కనిస్టేబు కళ్లుతుడుచుకున్నాడు. వాళ్లని కదలమని మళ్లీ చెప్పలేదు.

పార్థసారథి హోటల్లో విందారగిస్తున్నాడు. ఖైదీగా

డవ తనకేల? పాయసం! వెర్మిసిల్లీ (సేమియా) పాయసం కప్పు లోపోసేడు అయ్యరు. నోటికెత్తి తాగ్రిగబోయ్యేడు. పాయసం లా కనిపించలేదు. వానపాముల తుట్టలావుంది అంతా. పక్క వాడిగిన్నె చూచేడు. నిక్షేపంగావుంది. తాగ్రలేక వదలివేసే డు. జిలేబీవిరవబోయ్యేడు. వానాకాలంలో రోకలిబండలు ఒక దాన్నొకటి చుట్టుకుని వున్నట్లుంది. అదీ తినలేకపోయేడు. "ఏమి" అంటే "ఏమి" అని అంతా అడిగేరతన్ని. కారణం చెప్పలేకపోయేడు. మనుష్యులంతా శ్యామలరావులా కనిపి స్తూ వచ్చి "ప్రథమతప్పు క్షమించండి" అంటూ ప్రార్థిస్తు న్నట్టున్నారు. సారధి గ్రహించేడు. "ప్రధమతప్పు స్వల్పవిష యం- కన్నకూతురిమీద ప్రేమ. నాకాభాగ్యంలేదు- ఇల్లాలి తో పస్తువిందుట— నేనంత అదృష్టవంతుడను కాను- పాపం, కఠి నశిక్ష వేసేను" అన్నాడు. కచేరీచేరేడు. శ్యామ, శ్యామలరా వు, చిన్నబిడ్డలు అక్కడే వున్నారు. జవాను గజగజలాడేడు. శ్యామ వెలవెలబోయింది. బిడ్డ భయపడి ఏడ్చింది. శ్యామల రావు బిడ్డని బుజ్జగించేడు. ఈ దృశ్యం పార్థసారధి మనసును కల చివేసింది. అమరజ్యోతి తనహృదయంలో అంకురార్పణం అ ప్పుడేచేసింది. జైలుతలుపులు విప్పేడు. బిడ్డలు తండ్రిని కావ లించుకున్నారు. శ్యామ భర్తని ఆలింగనం చేసుకోబోయి వె నక్కి జంకింది. శ్యామలరావు శ్యామను దగ్గరగా లాక్కుని పార్థసారథికి నమస్కారాలు చేస్తూ "కృతార్థులం. భగవంతు డు మిమ్మల్ని రక్షిస్తాడు" అంటూ వెళ్లిపొయ్యేరు. దారిలో ఓ కనిస్టేబు ఒకబుట్టనిండా బొమ్మలు తెచ్చి వాళ్లకిచ్చేడు.

# సుబ్బన్న పెళ్లి.

పాత్రలు:—

సుబ్బన్న — పెళ్లికొడుకు.

సుకుమారి — పెళ్లికూతురు.

కరుణాకరం — సుకుమారి తండ్రి.

పాణి — సుకుమారి మేనత్తకొడుకు.

నీలమ్మ — దాసి.

రాజన్న — నౌఖరు.

వైద్యుడు.

రంగం 1.

ప్రవేశం:—సుకుమారి, పాణి.

సుకు:—పాణీ! మానాన్న మన వివాహవిషయమై చాలా పట్టుదలతో వ్యతిరేకంగా వున్నాడు. మాఅమ్మ ఎంత చెప్పినా, ఇంకెవరు ఏమిచెప్పినావినక, ఎవడో సుబ్బన్నట, వాడిదగ్గర డబ్బు చాలావుందని, వాడికే నన్నిచ్చి పెళ్లిచేద్దామని నిశ్చయించుకుని ప్రధానానికి రమ్మని తంతి పంపేడుట. ఆదార్భాగ్యుడు రేపటెల్లుండి వస్తాడుట. నాకాసంబంధం ఎంతమాత్రం ఇష్టంలేదు. ఈ వివాహం జరగకుండా నీవేదైనా చదరంగపుఎత్తు వేసేవా లేదా? లేకపోతే నీకునేను దక్కనుసుమా?

పాణి:_సుకూ, నీవింతగా నాకుచెప్పాలా? నాబాధ్యత నాకు తెలీదూ? మనం అనుకున్నట్టే కథనడుపుతున్నాను. మే ముచేసే ఏర్పాట్లు ఏవోనీకిప్పుడుచెప్పం; భారంఅంతా ముప్పా తిక భగవంతునిమీదే వేసేం.

సుకు:—మా నాన్న కెలానచ్చిందో ఆసంబంధంనాకే అర్థంకాలేదు. ఒట్టి, పల్లెటూరు. ఆపేరేమిటిబాబూ 'సుబ్బ న్నా, దిబ్బన్నాను. పాణీ నువ్వాయీపెళ్లి మానిపిస్తే నేకాని నన్ను మనవాళ్లంతా 'సుబ్బన్నపెళ్లాంటా' అంటుంటే నువ్వు వినడం గ్రహచారం పట్టుతుంది. మరేంజేస్తావో?.

పాణి:_ మరేమీ భయంలేదు. "సుకుమారి మొగుడు టరా" అని అనిపించుకునే అదృష్టం సుబ్బన్నకి పట్టేటట్టు కన పడదు. ఆఅదృష్టం ఎంతవాడికి వుండాలంటావుసుకూ? (అంటూ పాణి తన వేలితో తననే చూపించుకుంటాడు.)

ప్రవేశం—రాజన్న.

రాజన్న:_బాబూ, సుబ్బన్నగారిప్పుడే రైలుదిగివస్తున్నా రండి. సూడవలసిన ఇగ్రహం అండీ. సరీగ్గా మనబందరుకోడి నాగేవుంటారండి. సుకూ అమ్మగోరి గేచారం ఆయనగారి రూ పంలో వస్తున్నట్టవపించేరండి. బండిగూను, ఎనకాలముడీ, ఒట్టి వెర్రిమాలోకంలా కనిపించినారండి బాబూ. అయ్యోబాబో, సుకూ అమ్మగారామనిసితో కాపరం ఎలానేస్తారండి?

సుకు తెల్లబోయి విచారంగా వుంటుంది.

పాణి:—రాజన్నా! మనం భద్రంగా పనినడుపు తే సుకూ అమ్మకీ ఆయనకీ పెళ్లి కాదురా.

రాజన్న:—తమచిత్తంబాబూ. తమరెలాసెప్తే అలాగే నడుచుకుంటానండీ. అయ్యో గోరిమాటకేం కానీండి మా సుకూఅమ్మగారికీ మీకూ మాంచి సరసమైన జోడీ కుదుర్తా దండి- (సుకూ, పాణిలు ఒకరి నొకరిని చూసుకుని ముసి ముసి నవ్వులు నవ్వుకుంటారు.)

పాణి:—సుకూ! నువ్వుమాత్రం ఆసంబంధాన్ని అంగీకరించినట్లే నటించాలిసుమా. ఏమాత్రం వెగటుతనంచూపినా కథఅడ్డంగా తిరుగుతుంది, జాగ్రత.

సుకు:—చూద్దువుకాని కాదూ నేనెంత బాగా నటిస్తానో.

పాణి:—కాని సుకూ, మనం అనుకున్నట్లు కథసరిగ్గా నడవకపోతే?

సుకు:—మానాన్నతో గట్టిగా "నాకీపెళ్లొద్దని" దెబ్బలాడుతాను, అదెవరో అమ్మాయి చేసినట్టు.

పాణి:—అతడు లక్ష్యంచెయ్యకపోతే?

సుకు:— నాయావజ్జీవం పెళ్లేచేసుకోనని శపదంపడతాను.

పాణి:—అందుకూ లొంగకపోతే?

సుకు:—ఏం చెయ్యమంటావూ?

పాణి:—బ్రిహ్మాణ్యుడడ్డినా నన్నే పెళ్లాడితీరాలి.

సుకు:—అదే నాసంకల్పంను.

రంగం 2.

ప్రివేశం—రాజన్న, సుబ్బన్న.

రా:—బాబూ, మాఅయ్యాగోరు మీాకైనాతీకని న న్నంపినారండి.

సు:—సరే, మంచిది. ఆ విసనికర్రిపుచ్చుకుని విసురు.

రా:—(విసురుతూ) పంతులోరివోరంతా మీామాటే తలచుకుని ఆనందిస్తున్నారండి. గాలి బాగాతగుల్తాదాండి?

సు:—ఆ. అసలు గాలినాకాట్టే పడదు. వారంతా ఏ మంటున్నారాన్నిన్ను చూసి?

రా:—ఏమంటారండి; మంచోరని, గొప్పోరని, పలాచ టి చెయ్యనీ, కొంచెం పొట్టిగానూ లావుగానూ కుంచంనాగు న్నా, అందమైనోరనీ, అమ్మాయిగారికి సరైనపిల్లోడనీ.

సు:—సరే, ఇంకా.

రా:—మీారు సాన మంచోరుబాబూ. రాజునాగుం టారు. ఆ టోపీతీసేసి, ఆ జరీవోణీ మోజుగా ఒళ్లేటేసుకుని,

మండికేసుకు తివాసీమీద కూకుని కునుకుతూంటే, అచ్చూ మచ్చూ, మావూరి దేవాలయంలోని సెవిటిసెండీశురిడినాగే వుంటారయ్యా.

సు:—ఆహా?

రా:—బాబూ! మీ సేతి మురుగులేటలావున్నాయి? తాత గోరెట్టినవా? మాఅయ్యగోరికి ఆరిమావగారు, గరబాదానానికెట్టినారండి జోడుపోచీలు. కాని అయి ఇలానేనండి. పూరపోళ్లు సేసిన సేతే సేత. ఇప్పటి కంసాలినాకొడుకు లిలాసెయ్యేనేరు. మిమ్మల్నిసూత్తే నాకు సేనా ముచ్చటేస్తుంది బాబూ. అమ్మాయిగోరిని సిన్నప్పట్నుంచీ ఎత్తుకుతిప్పినోణ్ణి; పెళ్లై, ఇల్లిడిసిపోతారంటే దుఃఖమేస్తుందికాని, మీవొంటోరిసేతుల్లో పెట్టినందుకు భయంనేదుబాబు.

సు:—మీఅమ్మగారికే పర్వాలేదురా, మాదీ మంచి ఊరే. మాంచి గేదెపెరుగు, దంపుడుబియ్యం వుంటాయి.

రా:—మాఅమ్మగారొట్టి బక్కనావుంటారండి. పెరుగూ గిరుగూపోసి మీనాగే దుంపనాగ సెయ్యాల. అదీ అందంసందం అంటేని.

రంగం 3.

ఆసుపతిరి. పరివేశం వైద్యుడు, ఒకరోగి.

రోగి:—బాబూ వైతుకుడుగారూ, నే బతకనండిబా

బో. నే బతికేఆధారం అవుపడదు దేవుడో. ఇన్ని మందులుతి న్నా రోగం రోగంనాగే వుండిపోయింది బాబూ.

వై:—ఏమిటూ! ఏమైందని అలా ఏడుస్తావు. చచ్చి పోండే ఏడుస్తావెందుకూ? పదిహేనురోజులేకాదూ అయింది మం దారంభించి?

రోగి:—బాబూ యీతల ఎగిరిపోతోంది బాబూ. గు నపాంతో పొడిసేస్తోంది బాబయ్యా. మీమందు తినకముంది లాలేదుబాబు. నాజీవుడిలాంటి కష్టాలెరుగడండి. నేను నిలచే నిలకడ లేదండయ్యా. సంపేస్తే సంపెయ్యండి.

వై:—ఆపోటు రావడమే మంచిదిరా. నీవంట్లో రక్తం లేక జబ్బువచ్చిందా, రక్తంకోసం మందిచ్చేను. రక్తం బాగా చేరినరాల్లో బాగాతంతూంటే పోటుపొడవదూ? నువ్వు చావవు. చావడానికీ బతకడానికీ మనఇష్టమే.

రోగి:—అయితే మీరెందుకు బాబూవుండి, బతికేవోడి నికూడా బతకనియ్యకుండానూ?

వై:—యీరోగి వుత్తమంమడు. వైద్యచింతామణి లో. వ్రాసేడుకూడానూ యీరోగానికి కారణం ఉదరంఅని.

రోగి:—అదేదీ నాకు తెల్దుకాని బాబూ, ఆరుమాసా లనుంచి నాశిరసంతా పొట్లపండునాగ ఇడిపోతోంది.

వై:—మంచిది. నేనుచెప్పిన రోగానికదే లక్షణం. నీ శరీరంలో రక్తంతీసెయ్యాలి, దానితోకాని తగ్గదు. ఇదివరకెన్నిమాట్లు తీయించుకున్నావు?

రోగి:—పదేనుసార్లు.

వై:—సరే, ఇంకో అయిదుమాట్లు తీయించుకో. రెండు మూడు రోజులు పోయేక మందుమారుస్తాను. యీలోగా నువ్వు చచ్చిపోతే మాత్రం నాకు కబురుచెయ్యి. ఏమో, చచ్చిపోయిన రోగిని చూడ్డంమావృత్తి లాంఛనంకాదు. ఇదిగో చూడూ, నాఫీజు నూటపదార్లు చెల్లించివెళ్లు. ఒకవేళ నువ్వు చచ్చిపోతే నాకు బాకీపడివుంటావు, మళ్లీ యీరోగంతోటే పుడతావు మాఊళ్లో; అదీకాకుండా నీపితృదేవతలు ఋణస్తుడవైన నిన్ను ఆలోకంలోంచి తోసేస్తారు. ఏ ఋణం అయినా అట్టేపెట్టుకోవచ్చును కాని, వైద్యులదిమాత్రం కూడదు.

రోగి:—ఆ సంగతి నాకు తెల్సుబాబు. శలవు. (పోవును).

ప్రవేశం—పాణి.

పాణి:—అయ్యా! డాక్టరుగారూ నా ఉత్తరం అందిందా?

వై:—ఆ. అందిందండి. దానిగురించే ఆలోచిస్తున్నాను.

పాణి:—ఆలోచనకేముంది? ఆయన దిగబడ్డాడు యీవూరు. మరిఅంతా మీాదేభారం, ఎలానడుపుతారో. అతనికి మీాలోగిట్లోనే బసఏర్పాటు చేసేదు మామాము.

వై:—అయ్యో, విధిగా. మీమాటకి వ్యతిరేకం కూడానా? వివాహం అయేవరకూ వరుడు వారింట భోజనంచెయ్యకూడదనే నియమంచేత సుబ్బన్నగారికి మా ఇంట్లోనే బసఏర్పాటు చేసేరు కరుణాకరంగారు. నేను సిద్ధంగానేవున్నా.

(పాణి వెళ్లిపోవును.)

రంగం 4.

ప్రవేశం:—రాజన్న, సుబ్బన్న, వైద్యుడు.

రాజన్న:—అయ్యా డాక్టేరుగోరండీ, యీ అయ్యగోరేనండి మాఅయ్యగోరి కాబోయేఅల్లుడుగోరు. మీతో అయ్యగోరు సెప్పినారంటండి.........

వై:—(అడ్డంవచ్చి) అవున్రా, అబ్బా, ఆ ట్టేచదవకూ. నాకు తెలుసును.

(సుబ్బన్నతో):—అయ్యా దయచెయ్యండి లోపలికి; కూచోండి. మీపరిచయభాగ్యం నా కిదివరలో లేకపోయినా మీగురించి చాలా చాలా విన్నవాడినే. ప్రయాణం కులాసాగా అయిందా?

సు:—అయిందండి. కరుణాకరంగారు నాగురించి మీకుచాలా శ్రమఇస్తున్నారు.

వై:—అబ్బే, ఆమాట అనకండి. నేనూ వారికుటుం

బంలో వాడినే. మాకూ మాకూ చాలా మొహమాటాలు న్నాయి. ఏమిటంత విసురుగా దగ్గుతున్నారు?

సు:—రైలుప్రయాణం కాదండీ, అందులోనూ వెన్నె లాకటి, కొంచెం పడిశంచేసి, దగ్గువస్తోంది.

వై:—అయ్యో పాపం, అలానా? రాజన్నా, ఆబల్ల మీద గొట్టం నాకిలాఇచ్చి నువ్వు వెళ్లిపో.
(రాజన్న అలాచేయును)

వై:—సుబ్బన్నగారూ, ఏదీ బాబూ చెయ్యి. (నాడి చూసి, తలత్రిప్పి విషాదం సూచించేముఖలక్షణం కనపరుస్తాడు సుబ్బన్న తల్లడిల్లుతాడు.)

వై:—అన్నం బాగా సాయిస్తుందాండీ.

సు:—ఆ.

వై:—కాఫీ అలవాటేనా?

సు:—ఆ, రోజుకి ఆరుమాట్లు.

వై:— అదేనండీ, మనవాళ్లతో బాధ? ఒకమాటు త్రాగితేనే విషంఅది. అందులో ఆరుమాట్లా? చు, చు. అయ్యో మీకేమైనా కలలు వస్తాయా?

సు:—అందుకు లోటులేదండి, ఒకరాత్రికే నూరు.

వై:—ఎలాంటి కలలు.

సు:—కలలులాంటి కలలే. ఎందుకండోయ్ యీగొడవలంతా?

వై:—మీకు సరిగ్గా, త్రికాలవిరేచనం అవుతుంద్గా?

సు:—(కోపంగా)—మీ ప్రశ్నలు నాకేమీ అర్థంకావడంలేదు. నన్ను మీదగ్గరకి తణిఖీకి పంపేరనుకోను. మీప్రవర్తన చాలా విచిత్రంగావుంది.

వై:—అబ్బే, మరేంలేదండీ. వారెవరూ చూడమని చెప్పలేదుకాని, మీరు దగ్గుతూంటే...అనుమానంవేసి...

సు:—అంత సూక్ష్మగ్రాహులని నాకు తెలీదు.

వై:—కోప్పడకండీ సార్, మీమేలుకే చెప్పేను. నాకేమి అవసరంఅండీ. మిమ్మల్ని పరీక్షచేసినవిషయం ఒకరితో చెప్పబోతానా, ఏమన్నానా? ఆమాత్రం రహస్యంలేనివాళ్లం వైద్యవృత్తెలా చేస్తామండీ? లక్షలకొలదీ రోగులప్రాణాలు మాచేతుల్లో వుంటాయికదా.

సు—:అయితే మీ పరీక్షాఫలితం ఏమైనట్లు?

వై:—ఎందుకులేండి.

సు:—అలాకాదు, చెప్పాలి.

వై:—అబ్బే, మరేం ప్రమాదించేదికాదు.

సు:—అయినా అదేదో చెప్పకూడదూ? చికిత్స మీచేతే చేయిస్తాను.

వై:—ఎందుకూ, మీకాబోయే మామగారితో చెప్తాను. ఆయనే కుదురుస్తారు. మీచేతిసొమ్ము ఎందుకు ఖర్చుచేసుకోవడం?

సు:_ ఆయనతో చెప్పవలసిన అవసరం ఏముంది? అసలు రోగంఅన్నమాట సిసలుకానేలేదు. చికిత్స చేస్తూండండి, ఏంజరుగుతుందో.

వై:_ నేను చెప్పినా మానినా ఆయనకి ఎలానూ తెలియకమానదు. అంచేత ముందస్తిగా మనమే చెప్పేస్తే ఆయన ఖర్చులతోటే కుదుర్చుకుంటారు.

సు:—అయ్యా, వైద్యుడుగారూ ఏమి జబ్బులేనివాడికీ రోగంఅని పెట్టేరే, యీసమయంలో, దానికే చాలా నొచ్చుకుంటూంటే, పై పెచ్చు పిల్లనిచ్చే ఆయనతో ఉన్నవీలేనివీ కల్పించి చెప్పి ఫీజు పుచ్చుకుంటానని చెప్పడం ఏంభావ్యమండి? ఇందులో చాలా మోసం కనబడుతోంది. మీరు నాకు చికిత్స చెయ్యేలక్కర్లేదు.

వై:—నేనేం బలవంతం పెట్టేనుటండీ?

సు:_ అబద్ధాలుకల్పించి లేనిపోనివి ఆయనతో చెప్తానన్నారే, ఎందుకు?

వై:—అయ్యా, యదార్థం ఏమిటంటే, నేను కరుణాకరంగారియింటి వైద్యుడిని. ఆయనసొమ్ముతింటూ, తెలిసుండీ

కూడా మీావిషయం చెప్పకపోతే, తీరా వివాహంఅయినాక, ఎవరూ ఏమీాచేసేదిలేదు.

సు:_ అయితే నావివాహానికి అంతరాయంకల్పించే సంకల్పమా?

వై:— అమ్మమ్మమ్మ, ఎంతమాట?

సు:_ ఆయనతో చెప్పడానికే నిశ్చయించేరన్నమాట?

వై:—అది నావిధి అని నానమ్మకం.

సు:_ ఇంతకీ నాకు మీారు తార్పుచేసిన రోగమేమిటి?

వై:—ఉబ్బసలా కనిపిస్తోంది. ఇప్పుడే అంకురిస్తోంది.

సు:—కలలు రావడంకూడా ఉబ్బసకి లక్షణంవనా?

వై:—అబ్బే! అది పిచ్చికిలక్షణం. మీాకు మెదడులో కొంచెండిసార్డరువుంది. జాగ్రితపడండి.

సు:_(తనలో)...(యీా దుర్మార్గుడు ఏదో మోసం సంకల్పించుకుని నానానీచపు పనులకీ ఒడంబడుతున్నాడు. మోసానికి మోసమేఎత్తు- చూద్దాం.) అయ్యా! మీారుచెప్పినరోగాలు రెండూ నాకున్నాయని కరుణాకరంగారు వింటె నాకు పిల్లనియ్యరు. మీారామాట ఆయన చెవినిపడవేయ వద్దని నా మనవి. ఇందుకు లంచంగా మీాకు నూరురూపాయ లిస్తాను మా గ్రామం వెళ్లేక.

వై:— అబ్బెబ్బే! నేను మీా రనుకున్నంత నీచుడను కాను. నాకు డబ్బులంటే రోత,

సు:—అలాకాక్కాదు .కావలసివస్తే నోటువ్రాసి ఇప్పు డే ఇస్తాను. (తనలో, "డబ్బుఇచ్చి చచ్చేనా ఏమిటి?) ప్రమా ణం చెయ్యాలి ఆయనతో చెప్పనని.

వై:—మీరలా మొహమాటం పెడితే నేనేం చెయ్య ను? మీ ఇష్టం. సుబ్బన్న నోటువ్రాసి ఇస్తాడు. వైద్యుడుప్ర మాణంచేస్తాడు ఎవరితోనూ అతని రోగంమాట చెప్పనని.

## రంగం 5.

ప్రవేశం:—కరుణాకరం; (తనఇంటిచావడిమీద కూచుని)

క:—మాఅమ్మాయికి మంచి వరుడిని తేగలిగినందుకు నాకెంతో ఆనందంగావుంది. డబ్బుకా? సంచులతో మూలుగు తోందిట; పలుకుబడా? "క్కో" అంటే కోటిమందివచ్చి వాలు తారుట; మనిషా: రూపసి; ఒడ్డూ, పొడుగుకి లక్షణంగావుం టాడు. ఏమాత్రమో పల్లెటూరి చాయలున్నాయనికాదూ గుసగుసలు? యీ పట్నవాసపు కుంకలేమ్మాహా అందంగావున్నా రేం? గుర్రపుజుత్తు క్రాపింగూ, గుండారులూ, పీళ్లున్నూ అ మ్మాయే తెలివైందయితే, ఆ ఛాయలన్నీ మార్పించి నాజూ కుతనం తేలేకపోతుందా? అమ్మా! సుకూ! నీ వెంతటి అదృష్ట వంతురాలవమ్మా. కడుపునిండిన భర్త, కళ్లకింపైన ఐశ్వర్యం. నీకు యీసంబంధం కుదిర్చి నాబాధ్యత తీర్చుకుంటాను. ఇంక హాయిగా నిద్రపోతాను. ఒహళ్లేమనుకుంటే నాకేమీ? ఆపా ణిగ్రాడికంటె వెయ్యిరెట్లు నయం. ఎంతతండ్రిఅయినా ఇంతకం

కే ఏమి మంచిసంబంధం తెస్తాడు? పెళ్లిచేసి చూడమన్నాడు, ఇల్లుకట్టిచూడమన్నాడు. సామాన్యమా, సంసారాలంటేను?. సుబ్బన్న మంచి కలసికట్టయినమనిషి. మాకుటుంబంలోవాడై పోతాడు సుళువుగా.

పరివేశం—మార్వాడీ.

మా:—అయ్యా, ఏమిండీ, కరుణాక్రం బావాజీ ఉన్నారా?

క:—ఆ. ఎవరుమీరు? ఏంపని?

మా:—కొంచెం భోగట్టా చెయ్యాలా.

క:—నేనే కరుణాకరం. ఏం పనిమీద వచ్చేవు?

మా:—భయటోండి జీ, భయటోండి. బోల్తా వాలంహేమండీ, మీరు చాలాగొప్పవారని విన్నామ్. నిజమేనా:

క:—నిజమే. ఎందుకు:

మా:—మీరు వడ్డీబేపార్ చేస్తార్?

క:—చేస్తాం, ఎందుకు?

మా:—అచ్ఛా! ఏమ్లేదు. మీరు మీకుమార్తెకూ వివాహం చేస్తారుకాదూ?

క:—అవును చేస్తాం, ఎందుకు?

మా:—సుబ్బన్నకే ఇస్తార్ నహీఁ?

క:—సుబ్బన్నకే ఇస్తాం. ఏమి అలా అడుగుతున్నారు?

మా:—సైతాన్ సుబ్బన్న. మీకు నిండా మోసం.

క:—ఏమి, ఏమి? అతను సైతానా?

మా:—అవును. ఏక్కీసైతాన్, దోబీసైతాన్, డజన్ బీసైతాన్. అతను, మాకూ, ఇంకాపదిమంది మార్వాడీలకీ చాలాడబ్బు బాకీవున్నాడు. అడుగుతే, ఇదుగో ఇస్తామ్, అదుగో ఇస్తామ్, అని రెండు సంవత్సరాలు తిప్పి మాకు సైతాన్ చూపించేడు. అప్పుడు మేమంతా బేటా మీన్కి లంఛంఇచ్చి సుబ్బన్నానీ ఖబరాక్కొత్తే, మాకాళ్లుపట్టుకుని మీరు ఇచ్చే కట్నం పుచ్చుకుని మాబాకీతీరుస్తాం అని చెప్పేడు. ఆకట్నం మీరూ మాకు చెల్లించవాలా? లేకుంటే వివాహం జరగదు.

క:—(నిర్ఘాంతపోయి), అరే, ఏమియీ గ్రహచారం? నేను కలకాంచడం లేదుకదా? సుబ్బన్న లక్షలకి అధికారని తెలిసిందే. యీ మార్వాడీ జోరిగలాగ తగులుకున్నాడే. అయ్యో, ఎంతమోసం. ఒక్కరూ చెప్పేరుకారే వాడిసంగతి? నా కట్నంసొమ్ములో తీరుస్తానని మాటఇచ్చేడుట. హా దైవమా! నువ్వు నన్నూ నాబిడ్డనీ యీ సైతానుసుబ్బన్ననుంచి రక్షించడానికి పంపేవయ్యా యీ మార్వాడీని.

మా:—అయ్యా, మీరు ఏమిఆలోచన చేస్తార్. బేగీ పెళ్లి చెయ్యండి. మాసొమ్ము మాకు వస్తుంది.

క:—సరే అలాగే చేస్తాను. మీరు వెళ్లండి.

మా:—మీారు చాలా మంచిమనిషి. పోయి సుబ్బన్న తో మాట్లాడుతాం. (పోవును)

రంగం 6.

ప్రవేశం—కరుణాకరం.

క:—అరే, కథ అడ్డంగా తిరిగేటట్టుందే? ఆ పాణిగాడికీ పిల్లని నేను ఇయ్యానడానికీ, ఇంట్లోజరిగిన గందరగోళానికి, యీా వేళ నేను సుబ్బన్నవిషయం విన్న పరమనీచమైన వృత్తాంతానికీ, ఆలోచిస్తే నేనే ఓడిపోవలసివస్తోందే. ఇంతకీ పాణిగాడి నక్షత్రం బాగున్నట్టుంది. కొంపతీసి యీామోసంఅంతా వాడి కల్పనేకాదుకదా?

(ఇంతలో సుకుమారి ప్రధానపుటలంకారాలతో ప్రవేశిస్తుంది).

క:—అమ్మా,సుకూ, మనం తొందరపడి సుబ్బన్న సంబంధం చెయ్యడం అట్టే భావ్యంకాదని తోస్తోందమ్మా.

(సుకుమారి తెల్లబోయి ఆశ్చర్యంగా చూస్తుంది.)

క:—నీ అభిప్రాయమేమిటమ్మా. సిగ్గక్కర్లేదు చెప్పు. ఈడువచ్చినదానవేకాదూ.

సు:—ఆసంబంధం ఎందుకు వద్దన్నావు నాన్నా?

క:—కొన్ని చిక్కులున్నాయమ్మా.

సు:—నాకు ప్రధానం చెయ్యదలచుకున్న పురుషుడికి కాక అన్యులకియ్యడం హిందూసాంప్రదాయంకాదు నాన్నా. నాకు ఆసంబంధమే చెయ్యి.

క:—అబ్బే, నీకు తెలీదమ్మా. ప్రధానం అవలేదుకాదూ. అయినాకూడా, పీటలమీద పెళ్లిళ్లెన్ని తప్పుతున్నాయి కావు?

సు:—నీఇష్టం నాన్నా, నీకు వ్యతిరేకంగా ఎప్పుడూ చెప్పలేదు. (పోవును.)

క:—(తనలో) పాపం, సుకు నాకెప్పుడూ వ్యతిరేకంగా నడవలేదు. దానికీ మార్వాడీ గోడు తెలియదు; అది పాణిగాడి కృత్రిమమే అనుకుందుకు వీలులేదు; ఏమంటే, తానుచేసినదేదైనా సుకూతో చెప్పకమానడు. చెప్పివుంటే సుకూ ఇలా ప్రవర్తించదు నాదగ్గర.

(ఇంతలో వైద్యుడు ప్రవేశిస్తాడు.)

క:—దయచెయ్యండి భిషగ్వర్ గారూ. ఊరక రారు పెద్దలు. ఏమిటికథ.

వై:—అబ్బే, ఏమీలేదు. యోగక్షేమం తెలుసుకుపోదామని.

క:—అహా; ఏదో చెప్పడానికే వచ్చేరు. మీ ముఖవైఖరే చెప్పుతుంది.

వై:—మనఇంటికొచ్చిన సుబ్బన్నగారిలా రాలేదూ?

క:—ఇంకారాలేదు. ఏమి?

ఏమీలేదు. ఆయనకీ నాకూ ఓచిన్న వ్యవహారం కుదిరింది.

క:— నిన్నకాక మొన్ననేకదా వచ్చేడాయన. అప్పుడే ఎలా బుట్టలో వేసేవ్.

వై:— బుట్టలోవెయ్యాడానికేంలేండి. వైద్యుడి అవసరం లేనివారెవరూ?

క:—ఏమిటి మీవ్యవహారం?

వై:—అదోరహస్యం. ఎవరితోనూ చెప్పనని ప్రమాణంచేసేను.

క:—ఆ, ప్రమాణాలకే లోపమా? చెప్పు.

వై:— కంట్రాక్టు చెప్పకూడనిదేకాని, నాడబ్బురానడం కష్టంఅని ఓ మార్వాడీచెప్పగా విని భయంవేసి మీసహాయం కోరి వచ్చేను. అది ఒకందుకు మీకూ క్షేమమే. మీరు చేతనైనంతసాయంచేసి, నాడబ్బు నాకిప్పించుతారా?

క:—ఆ, తప్పకుండా.

వై:—ఆయనకోజబ్బుంది; దాని చికిత్సవిషయమై మాకుజరిగిన అగ్రిమెంటులేండి.

క:—జబ్బా! ఎవరికీ? సుబ్బన్నకే? అదేమిటయ్యా?

వై:—అవునండీ, ఉబ్బస.

క:—అమ్మో. నిజంగానే.

వై:— మీతో అబద్ధం చెప్తానాఅండి? ఇంకా ఆమాట కొస్తే కొంచెం మతిభ్రమణకూడా వుంది. మీరు కనిపెట్టేరో లేదో!

క:—కనిపెట్టకేం. ఉత్త దగ్గేఅనుకున్నాను. అయ్యో, భగవంతుడా, మమ్మల్ని కాస్తున్నావుతండీ. ఆ దౌర్భాగ్యు డెలా దాపురించేడుమాకూ?

వై:—మీరెలానా చెప్పి నాకాడబ్బిప్పించాలి.

క:—ఆపూచీ నేపడనుకాని, అతనురాగానే నీకు కబురు పంపుతాను. వచ్చి మాట్లాడుకో.

రంగం 7.

ప్రవేశం రాజన్నా, సుబ్బన్న.

సు:—రాజన్నా, నాకు యీగ్రామంలో నువ్వు ఒకడివే నిజాయితీమనిషివిలా కనపడతావోయ్.

రా:— సిత్తంబాబూ, మీదయవుండాలికాని. మీమనసు మంచిదిబాబయ్యగారు.

సు:—నువ్వు తీసుకెళ్లేవే, వైద్యుడు? ఎంత బలేదగా కోర్ అనుకున్నావు?

రా:— ఏం బాబయ్యా, ఏంజేసినాడేంటి? మాఅయ్యగారితో సెప్పి సెమడాలెక్క తీయించేస్తాను.

సు:— అబ్బే! అలాంటిదేంచెయ్యొద్దు. తిననీ, నాసొమ్మెందరు తిన్నారుకారు? మాఘనవైద్యుడిమల్లే, యీమాటా ఆమాటా చెప్పి, చెయ్యిచూసి, గుండెలుచూసి, పెదవివిరుచుకుని, ఎక్కడలేనిదుఃఖం తెచ్చుకుని ఏడవడం మొదలెట్టేడు, వీడికొంపమునిగినట్టు. వీళ్లతస్సాదియ్యా ఒకకానీకి ఎంతైనా మోసం చేస్తారు. నాకేమో ఉబ్బసని, ఉన్మాదంఅని ఏవేవోకోసి, నాచేత వందరూపాయలకి నోటు వ్రాయించుకున్నాడు.

రా:— ఏమిటీ? నోటే? వీడితాడు తెంచుతానుండండి. మాఅయ్యగారితో చెప్పి, ప్రూర్లోంచి గెంటింపించేస్తాను. అబ్బో, ఆయనసంగతెవరికి తెలీదు? పేరుచెప్తే పిట్టలైనా నీరుతాగవు.

సు:— మీఅయ్యగారి కంతపలుకుబడే?

రా:— చెప్పాలాబాబూ! ఆయన తలుసుకుంటే బంగారం నష్టం కురాల, కావాలంటే పిడుగులు రాలవలసిందే.

సు:— రాజన్నా, యీసంగతి మీఅయ్యగారితో చెప్పకు. పోయినడబ్బు పోతేపోనీ.

రా:— (తనలో) యీబాపనోడికి సుకూలమ్మగారినిచ్చి పెళ్లిసెయ్యనంటారని బయ్యం. (పైకి) వైద్యుడికి డబ్బు మీరియ్యడం నాకిష్టంలేదుబాబూ.

సు:— ఆ. ఇచ్చేశిసేనూ; నాతంమాత్రిం తెలీదూ భాగవతం?

రా:— (తనలో) ఇదంతా బాగోతంకాక మరేటి?. సత్తికాలమనిసి. (పైకి) బాబూ బజారికెళ్లొస్తానండి.

సు:— రాజన్నా, మీఅయ్యగారిని చూడాలి, తీసుకెళ్లు.

రా:— ఏంబాబూ? అమ్మాయిగోరిని సూడ్డానికీయేతే నా ముఖుర్తం?

సు:— చూడ్డానికేమిటి? పెళ్లిప్రియత్నానికే.

రా:— పెళ్లేఅండి? పుస్తికట్టే?

సు:— మరింకెలాగ?

రా:— సిత్త్రం. సిత్త్రం. ఏంపెళ్లో, ఏంనోకమో?

సు:— ఏంరాజన్నా, అలాఅంటున్నావు? ఏంసంగతి?

రా:— ఏంనేదుబాబు.

సు:— ఛా దొంగా! నాదగ్గర దాస్తున్నావా? నువ్వే నిజాయతీమనిషివనుకుంటున్నాను.

రా:— పోనీండిబాబు. నోరుజారి అనేసినాను. తప్పు చమించండి.

సు:— చెప్తేకాని వీల్లేదు.

రా:—మీరలా శెలవిస్తే నేనేంజేసేది బాబయ్యా? సెప్తానుకాని, అది మీమంచికేఅని సమాధానం చేసుకోవాలి. అ

మ్మాయిగారండీ పెద్దమన్నిసై మూడేళ్లొందండి. కొంచెం పట్టో సంకాదండీ, యీడొచ్చినా పెళ్లికాకపోతే ఆచ్చేపన నేదండి. మాంచి చలాకీ మనిసండి. ఆమె మేనత్తగోరి అబ్బాయి ఇక్కడే బి. ఏ. వో యమ్. ఏ. వో పెలిగిత్తున్నారండి. ఆరిద్దరూ మాంచి యీడైన జట్టండి. ఒకరొకరొగ్గరండి; కాని పెళ్లాడు కోరండి. వూళ్లో బుకారేతంటే, ఆపాపపుణ్యాం భగమంతుడికెరిక, ఎవరు నూడొచ్చినోరు? ఆమధ్య పదిరోజుల్నుంచి అమ్మాయిగోరికి డాక్టరు దొరసానమ్మ మందిస్తున్నదంటండి. అదీకథ.

సు:_ ఇయ్యకూడదా జబ్బుచేస్తే?

రా:_ అయ్యో, కాదుబాబూ, మీరుత్త సత్తెకాలపు మనిషి. (నవ్వును).

సు:_ ఇలాంటి గొడవలు మాకర్థంకావురా. విశదంగా చెప్పు.

రా:_ నేచెప్పనుబాబూ, నాకొంప మునిగిపోతుంది.

సు:_ చెప్పాలి రాజన్నా.

రా:- (రహస్యంగా) అమ్మాయిగోరు గర్భిణీటండి. మందేసినారు.

సు:_ (ఆశ్చర్యపోయి స్థంబిస్తాడు) అన్నా, ఎంతపని? కాలం ఎంతగా మారిపోయింది? అందుకనే ఆయన తొందరపడి పదివేలైనా కట్నం ఇచ్చివేస్తున్నాడు. నాకొద్దు యీ ఖండాలపు పెళ్లి. (పోవును).

రా:— మాకోరికే అదేనండి. అయ్యగోరి తలలోకి ద య్యం బాగా ఎక్కింది. గిజామంటే ఒగ్గదు. వేస్తే పాచిక ఇ లాపారాల. అటుకాసి కరుణాకరంబాబుకి మార్వాడీవేసంవేసి అలా ఎక్కించినాను పిశాచాన్ని. ఏమి తెలివైనవోరండీ పాణి గోరు! సబాస్. ఆయన బాణానికడ్డునేదు, అప్పీలునేదు. ఇం కో మంచి నాటకంకూడా ఆడతాం. సూడండి నాతమాసా.

## రంగం 8.

పరివేశం—కరుణాకరం, సుబ్బన్న.

కరుణాకరం సుబ్బన్ననిచూసి నిర్లక్ష్యంగా ఊరుకుంటా డు. సుబ్బన్న అగౌరవం పాలైనానని చిన్నబోయి నుంచుని కోపంతో,

సు:—అయ్యా! కర్మంచాలకపోతే కాబోయే మామ గారూ! మీముఖం అలామాడిపోయి వుందేమండీ? మీ అ మ్మాయిని అమాంతంగా ఎత్తుకపోతానని దిగులుగా నున్నా రేమో! ఆ భయం అక్కర్లేదు. గుర్రానికనివచ్చి గాడిద నెవ రూ పట్టుకుపోరు.

క:—(తనలో) యీ ద్విపాదపశువు ధోరణిచూస్తే, వై ద్యుడు చెప్పినట్లు వీడికి పిచ్చివున్నట్టే కనపడుతోంది. (పైకి) సుబ్బన్నా! నువ్వు అదేఆలోచించేవు కాని, అరవైఏళ్లు నెత్తికొ చ్చిన ముసలిముండాకొడుకునైన నేను, నాపిల్లని రోగిష్టిపాడికీ, అప్పులపాలైనవాడికీ ఎలా ఇస్తాననుకున్నావు?

సు:—అదంతా ఓఖాంయ తమాషాలేండి. ఎవరో ఘూపెళ్లి కాకుండా చేయడానికి చేస్తున్న మోసంలావుంది. ఎన్నేళ్లు నెత్తికి వచ్చినా బుద్ధీ, జ్ఞానం వుండొద్దూ? దుక్కలాగవున్నవాడికి నాకు రోగమా? అన్నవాడికి రోగమా? లక్షలకి అధికారినైన నేనా అప్పులపాలయ్యేది? ఇదంతా మోసం-మోసం-మోసం.

క:—డాక్టరు పరీక్షచేసిచెప్పేడు.

సు:—వాడు అబద్ధంచెప్పేడు.

క:—మార్వాడీ నీమీద డిక్రీపట్టుకువచ్చేడు; కట్నం సొమ్ములోనుంచి తీరుస్తానన్నావుటకాదూ?

సు:—(నోరుకొట్టుకుని) అయ్యో, అయ్యో, ఏమిటాగ్ర హాచారం? ఏమార్వాడీ, డిక్రీఏమిటి? కట్నంలో తీర్చడంఏమిటి? రండిమాఇంటికి, లక్షరూపాయల రొఖ్ఖం ఇప్పుడే గుమ్మరిస్తాను. మీరంతా మోసంచేస్తున్నారు. పిల్లనియ్యడం ఇష్టంలేకపోతే మరోలా చెయ్యాలికాని ఇంతమోసమా? మనిషిని అమర్యాదా పాలుచేయడమా? మీమీద మానసష్టపుదావా తెచ్చితీరుతాను.

ఇంతలో ఓజట్కాబండి కరుణాకరంగారి ఇంటిగుమ్మం ముందర నిలుస్తుంది. ఆబండీకి రెండువైపులా పరదాలుకట్టబడి వున్నాయి. జట్కావాడు బండిదిగివచ్చి కరుణాకరంగారిని చూసి, "అయ్యా! ఎవరో ఆడంగులు వచ్చేరు" అన్నాడు.

కరు:—సరే లోపలికి వెళ్లవచ్చునని చెప్పు.

జట్కా బండిలోంచి ఓభోగంమనిషి, చక్కగా సింగారించుకుని వుంది, ఒయ్యారంగావచ్చి, సిగ్గునభినయిస్తూ, కరుణాకరం, సుబ్బన్న వున్నచావడిలోకి వచ్చినించుంది.

క:—ఆడంగులు లోపలనున్నారు, వెళ్లవచ్చు.

భోగం:— (కరుణాకరానికీ, సుబ్బన్నకీ దండాలుపెట్టి) అయ్యగారూ, మీాదగ్గర పనిమీాదే వచ్చేనండి.

ఆమెను భోగంమనిషిగా గ్రహించి కరుణాకరం, సుబ్బన్నా, ఒకర్నొకరు అనుమానిస్తూ, ఒకర్నొకరుచూసుకుంటూ తెల్లబోతారు. భోగంది సుబ్బన్నకాసి వారచూపుచూసి సిగ్గునభినయిస్తూ, చమత్కారంగా చిరునవ్వు నవ్వుతుంది. సుబ్బన్నగుండెలు గుభాలుమంటున్నాయి. ఎవరకీ మాటరాదు. కొయ్యలాగ నించున్నారిద్దరున్నూ.

భోగం:—సుబ్బన్నగారూ, ఏమండీ తెల్లబోయి అలా దిక్కులు చూస్తారు?

సు:—(కంగారుగా) నువ్వెవరు? నాపేరెలా తెలిసిందనీకు?

భోగం:—(కోపంతో కనుబొమలు ముడిచి) నువ్వెవరనే కాటి కొచ్చిందా వ్యవహారం? అప్పుడే మరుపా? అబ్బాయిగా

రుపెళ్లి కుమారుడై పల్లకీలో కూచుంటే కళ్లారాచూదామ నొచ్చేను.

సు:—నువ్వెవరో నాకు తెలియదు. నా పేరుపెట్టి పిలచి ఇంతచనువుగా మాట్లాడుతున్నావు. ఆడదానివికావూ? సిగ్గు లేదూ?

భోగం:—మీగుట్టు బయటపెడతానేమోనని అనుమా నించి చీవాట్లుపెడితే బెదరిపోతానా? రండి, పోదాం మనఇంటి కి. అమ్మతోడు, అబ్బతోడు అని సత్యాలూ ఒట్లూపెట్టుకున్న పెద్దమనిషి నన్నొదిలిపెట్టి ఏంముఖంతో పెళ్లాడడానికొచ్చేరూ?

సుబ్బ:—ఘోరం, ఘోరం. రామా, రామా, ఇదేం గ్రహచారంరా భగవంతుడా, ఇంటావంటాలేనిదీ. ఏయ్, యీ దగుల్బాజీ వేలాపనచేస్తే చెప్పట్టుకు పళ్లురాలకొడ్తాను. ఎవర నుకున్నావో?

భోగం:—ధైర్యంవుంటేరండి; అబ్బో, మీజడిపింపు. తాటాకుచప్పుడుకి కుందేళ్లుబెదరవు.

కరు:—నీమాట ఏమిటో చెప్పెయ్యిపిల్లా.

భోగం:—బాబయ్యగారూ, మీకొకదండం అండి. పీట్ల మీదపెళ్లి బోర్లాతీసేనని అనుకోవద్దండి. ఎవరిగోడువారిది. మీ కూ మంచికే చెప్పుతున్నానండి. యీ బాపనయ్య నేను పుష్ప వతినవగానే నాకు మూడు వేలచ్చి తెచ్చుకున్నారండి నన్ను. అ

దీ ఓగంధర్వవివాహం అండి. అప్పటినుంచీ యీ అయ్యనేన మ్మకుని కులస్త్రీలాగే మసులుకొంస్తున్నానండి. ఆ బాబూన న్నే వలచి ఇంకోఆసక్తి లేకుండా గౌరవిస్తున్నారండి. అయిదేళ్ల యిందండి బాబయ్యగారూ యీయనకి నాకూ సంపర్కంఅ యి, ఎన్నోమాట్లు ప్రమాణాలు చేసేరండి. ఇంకెవ్వరినీ పెళ్లి చేసుకోను, నీవే నాభార్యవు అంటూను. మీదయవల్ల మాకే మీలోటులేకుండా కాలక్షేపం అయిపోతోందండి. యీయన గారి మూలాన్న మాఅమ్మతోకూడా విరోధం తెచ్చుకుని వే రెట్టేనండి. ఇంతలోకీ మాచిన్న చెల్లెలికి శోభనంఅని ఉత్తరం వస్తే యీబాబేకొన్న చీర, రాగిడీపట్టుకెళ్లి పదిహేనురోజులైం దండి. అబద్ధమేమో ఎవరుగా వున్నారు మనిషినినిలబెట్టి అ డగండి. యీలోగా పదివేలరూపాయిలకట్నానికాశించి మీ అమ్మాయిగారిని చేసుకుంటూరంటండి. నన్ను గోతులోదింపుతా రండి. సబువుగావుంటే చేయించండి బాబుగారుపెళ్లి. ఇందు లో ఏమీఅబద్ధం లేదండి. ఆబాబునే నిజంపలకమనండి.

క:—పకీరి దగాపీనుగా నీకేం రోగం వచ్చిందిరా.

సు:—అయ్యో, నోటికివచ్చినట్లు పేలితే దవడలు వి రగగొట్తాను. యీముండ ఒట్టిఅబద్దాలు చెప్పుతోంది. ఎవ రో దీనిని యీపనికి డబ్బిచ్చి పురమాయించేరు. అంతా అబ ద్ధం, అంతా మోసం.

భోగం:—అంతా మోసమా? ఏమిటీవగలు, వగలాఅని, ఉండండిబాబయ్యగారూ బుజువుచేస్తాను.

భోగంది జట్కాదగ్గరకుపోయి ఓ మూడునాలుగేళ్ల మగపిల్లవాడిని అందులోంచి పైకి తీసుకువచ్చింది. ఆపిల్లవాడు సుబ్బన్నని చూసి, సంతోషంతోనూ, ఆతృతతోనూ, "నాన్నా! నాన్నా" అంటూ అమాంతంగావాలి అతనిమీదపడబోతే, సుబ్బన్న నిర్ఘాంతపోయి "ఇదెవర్తో రావణాముండలాగవుంది; బాగా తరిఫీదైంది నటనలో. ఆకుగ్రివెధవనీ అలాగే తయారుచేసింది. నాకీవ్యవహారంచూస్తే పిచ్చెత్తుతోంది. పెళ్లీవద్దూపెడాకులూవద్దు".

క:—మూడుమూర్తులూ సుబ్బన్నగారిపోలికే ఆచంటివాడు.

సు:—అయ్యా! కరుణాకరంగారూ, మీకూ మీఅమ్మాయికీ సలాం. ఇంతగందరగోళంతో సాగేపెళ్లి ఎవరికి సుఖం. మీబుద్ధితక్కువకనిపెట్టి మిమ్మల్ని చులకనిజేసి యీవివాహంకాకుండా చేసేసంకల్పంతో శతృవులెవరో ఇలాపడిపించి విజయులైనారు. నామీద వెయ్యిరాని నిందలు మోపేరేకాని, మీఅమ్మాయి, మేనత్తకొడుకుతో సరసాలుపోయి వాడిని ఇదివరకే గాంధర్వం వివాహంచేసుకుని రేపోనేడో నీళ్లాడ్డానికి సిద్ధంగావుంది. నాకు రాజన్నగాడు చెప్పేడు. ఆపిల్ల ఎవడికి కావాలయ్యా. ఇదే మాఊరయిందిగాదు ఏంచేస్తునో. మానసష్టపుదావాకి రేపే నోటీసువస్తుందిమీకు, కపడ్దార్. (పోవును.)

భోగం:—బాబూ మీరలా తెల్లబోకండి; యీఅయ్య ఉడుక్కుని అమ్మగారిమీద నేరంమోపేసేడు. అది నిజంఅను కోకండి. నాకు శలవిప్పించండి.

క:—సుబ్బన్నఅన్నట్టు ఇదంతా మోసమేపమో! ఏమైనా సుబ్బన్నఅంటే అసహ్యంపుట్టింది. నేవిన్నసంగతులన్నీ నిజమేఅయితే భగవంతునెంతగా ప్రార్థిస్తునూ, యీసంబంధం తప్పినందుకు? పాణిగాడిమూలాన్ని పిల్లకి నీలాపనింద రానేవచ్చింది. వాడికేఇచ్చి దాన్ని పెళ్లిచేస్తే ఆకళంకం పోతుంది. ఇంతకీ వాడిరోజులు బాగున్నాయి.

## రంగం 9.

ప్రవేశం—రాజన్న, భోగంది, సుకుమారి, పాణి.

పా:—నాటకం బాగా ఆడేరా?

భోగం:—ఆడ్డంలోనూ, ఆబాబు తోక తెంపుకుని ఒకటేపరుగు.

సుకు:—మానాన్న ఏమన్నాడు?

భోగం:—ఆ సంబంధం తప్పినందుకు దేవుడ్ని ప్రార్థించేడు. (అంతానవ్వుతారు.)

రాజ:—అయితే ఇంకా ఎందుకు యీ వేసం?

"అక్కర్లేదే" దని భోగంది తన వేషం తీసేసి సుకుమారి దాసియైన నీలమ్మగా తన నిజరూపంలో వుంటుంది. సుకుమారి దానికో మొహారు బహుమానం ఇస్తుంది.

## రంగం 10.

ప్రవేశం—కరుణాకరం, సుకుమారి.

క:—ఏమమ్మా సుకూ అలావున్నావు?

సు:—మొదటి సంబంధం, తీరాలన్నీ కుదిరి, ఇలాతప్పి పోవడం కేవలం అశుభంగా కనబడుతోంది నాన్నా.

క:—ఆ! ఒట్టిమాట. ఆట్టేవెర్రిపడక.

సు:—అదీకాక ప్రధానం నిశ్చయం అయింది. ఆవరుడే భర్త అవాలి కాని లేకపోతె హిందూవనితకి చాలాఅవమానం.

క:—ఏ ధర్మశాస్త్రంలో వ్రాసివుంది?

సు:—నిక్షేపంలాంటి సంబంధం అని ఎందుకువిడచేసేవు? నన్నువిడిచి వుండలేవునాన్నా నువ్వు-

క:—వాడో దౌర్భాగ్యుడు, రోగిష్టిపాడు, అప్పులపాలయ్యేడు, ముండలముఠాకోరు.

రాజన్న ప్రవేశించి— రా:—బాబూ! పాణిగారు పరీక్షపాసయినారండి.

క:—సరే.

సుకుమారి సంతోషాన్ని వెలిబుచ్చుతుంది. కరుణాకరం కనిపెట్టుతాడు.

క:—మొదటి ముహూర్తం ఎందుకుతప్పించాలి! మొదట నువ్వు వరించినవాడినే వివాహం చేసుకుందువుకానిలే.

సు:—అంటే.

క:—పాణిగాడిని.

సు:— వద్దనడానికీ అవుననడానికీ నీకే చెల్లిందినాన్న. (పోవును).

(తెరవెనకాల) పాణి రివ్వునవచ్చి, సుకు చెయ్యిపట్టుకుని, "సుకూ! గెల్పుమనదే" అన్నాడు.

సు:—నిష్కల్మషమైన ప్రేమకు ఎల్లప్పుడూ విజయమే సమకూరుతుంది.



# ఇలు వేలుపు.



“కృష్ణా! నాతండ్రీ, నా భాగ్యరాసి, నా ప్రేమనిలయమా? రావయ్యా, యీబీదదాసినీ కారగింపుచేసే యీపాలూపదార్థమూ ఆరగించి వెళ్లుతండ్రీ. నేనిచ్చే యీతృణమునే స్వీకరించి నన్ను ధన్యురాలనిచేసి, నీ ప్రేమతత్వాన్ని, నీవాత్సల్యాన్ని నీగీతలో ప్రబోధమైన నీమహత్తర వేదాంతరహస్యాన్ని, నాకోసం, మానవులకోసం, విశ్వకల్యాణంకోసం, పదే పదే క్రియారూపంగా ప్రకటించవోయీ. “పత్రం పుష్పం ఫలంతోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రియతాత్మనః” అనిన నీప్రబోధానికి సత్ప్రమాణంగా నీవు గీతించిన, “అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్,” అనిన నీ ప్రతిజ్ఞకి స్వరూపాన్నిచ్చి నన్నుద్ధరింపుము తండ్రీ” అంటూ రూపనగరనివాసియైన రాధాదేవి ఎంతో ఉత్సాహంతో, భక్తితో, శ్రీక్రష్ణపరబ్రహ్మ స్వరూపానికి స్వీయభక్తిస్వరూపమైన పాయసాన్ని నివేదనచేసింది. అంతకు మునుపే శ్రీకృష్ణ విగ్రహానికని పూజకల్పింపబడిన రక రకాల పువ్వులూ కుప్పగా పోసివై సహజమైన దోవతి మల్లె కప్పివున్నాయి. పళ్లెంలోని హారతిన్ని, అగరువత్తి పరిమళధూపంను పూజామందిరాన్ని ఆవరించుకుని ఆనందాన్నిస్తున్నాయి. తదితర పూజాద్రవ్యాలన్నీ కూడా ఆప్రదేశానికో వింతసోయగాన్ని, విస్మయమైన దేవ

త్వాన్ని చూపక చూపక చూపిస్తున్నాయి. ఇంతెందుకు, ఆప్ర దేశంఅంతా శ్రీకృష్ణమయం అయిపోయి, ఎటుకాసిచూసినా అతని మూర్తివంతాన్ని ప్రత్యక్షంచేస్తూ 'శ్రీకృష్ణనిలయమే యిది' అనే తలంపును పురికొల్పకమానదు. రాధాదేవి పాలనీప దార్థాన్ని నివేదనచేసినదే తడవుగా నామె స్వచ్ఛమైన చిదానందాన్ని పొంది, ఒకపరమోత్కృష్టమైన నిశ్చలసమాధిలో మునిగిపోయింది. ఆ సమయంలోనే శ్రీకృష్ణపూజాపీఠంనుండి సన్నటి, శ్రావ్యమైన, మనోహరమైన మురళీనినాదం వినిపించింది. అది రానురాను స్పష్టమై, మధురాతిమధురమైన రాగాలాపనలో ఔన్నత్యం వహించి, హృదయాన్ని చలింపజేసే, మానసాన్ని చోరీచేసే గంభీర భావోన్నతిగల ఓ ప్రేమసందేశపు గీతికగా పరిణమించింది. ఇంతలో రాధాదేవి సమాధిలోనే మందహాసంచేస్తూ ఆనందబాష్పవర్షాన్ని వర్షిస్తూ "శ్రీకృష్ణమురళీ, జైకృష్ణమురళీ, శ్రీకృష్ణచరణే, జైకృష్ణచరణే" అనే కీర్తన నామపుగా, డాంబికములేని ఆవేశముతో నానందముతో పాడి పాడి, జోహారునిడి యోగసమాధినుండి మేల్కొన్నది. యీ వేడుక నామె ప్రతిదినమూ అనుభవించుచుండెడిది. ఆ కారణంచేత రాధాబాయి, తన కుటుంబానికి తినడానికీ, కట్టడానికీ వుండినా మానినా విషాదపడక, శ్రీకృష్ణుని కరుణపైనే భారమంతా వేసి మోక్షసాధనమైన ప్రేమతత్వాన్ని అలవర్చుకుని, తుచ్ఛసుఖాలకి తావు ఇచ్చేదికాదు. అయినా తనఏకపుత్రుడైన గోవిందుడు మాత్రం మాటిమాటికీ దేనికోదానికి మారాముచేస్తూంటే, మాతృహృదయం అవడంచేతనో, మా

నవస్వభావం అవడంచేతనో, అప్పుడప్పుడామె ఒక్కమారు మోక్షసాధంనుంచి సుఖాలున వాంఛాకూపంలోకి కూలబడుతూండేది. అయినా ఆమెభక్తి అతీతమైనది, పారవశ్యమపారమైనది.

రూపనగర మోపల్లెటూరు. అందలి ప్రజలు విశేషంగా వ్యవసాయంచేసి జీవనంచేసేవారు. గ్రామపరిసరప్రాంతమంతా మేలైన శిఖరాలచేతనూ, పాతాళాన్ని సమీపించే లోవలతోనూ, దట్టమైన అడవులు, నిత్యం ప్రవహించే నదులతోనూ చుట్టివుంటుంది. చుట్టుపట్లగ్రామాలవారికీ రూపనగరవాసులకీ రాకపోకలకి మార్గాలు యీఅరణ్యాలూ యీలోవలునుంచే. రాధాభాయి భర్త క్షత్రియ కులజుడు; పేరు కులదీపికసింగు. అతను చాలా బీదవాడు. వ్యవసాయాన్నే జీవనాధారంగాచేసుకుని గుణవతియైన రాధాభాయి నేర్పుచేత తన చిన్న సంసారాన్ని ఎలాగో వెళ్లబుచ్చుతుండేవాడు. అతనూ రాధవలెనే మహాభక్తుడు. ఊరిలోవారి మల్లేనే తానుకూడా, రాధాదేవి శ్రీకృష్ణసందర్శనభాగ్యాన్ని కనుటలో ఆమెప్రభావాన్ని గుర్తెరిగి గౌరవించేవాడు. తాను కష్టపడినాసరే, కడకి పస్తుపడినాసరే, రాధకి కావలసిన పూజాద్రవ్యాలుమాత్రం వేళకి కొనితెచ్చిఇచ్చేవాడు. ఒక్కొకనాడు తనకే ఆశ్చర్యంవేసేది ఎలాగ తేగలిగేనోఅని, దగ్గర ఓపైసాఅయినా లేదనుకున్న సమయాల్లో. తాము ఆరాధించు శ్రీకృష్ణభగవానుడు వారికీ విషయంలో ఏమాత్రపు లోపం కలగజెయ్యకపోవడంచేత వారికి ఆయనయందు మిక్కుటమైన వాత్సల్యంకుదిరింది. కొన్ని

క్లిష్టపరిస్థితులలో శ్రీకృష్ణుడు రాధకి సమాధిలోకనిపించి అట్టి పరిస్థితులు తొలగేవుపాయాలు చెప్పుతూ తానూ వారిసంసారంలో ఒకడై వుంటుండేవాడు. ఇంక వారికి కావలసిందేమిటి? ఏచీకూచింతాలేకుండా తమ ఇలువేల్పుమీదే భారంవేసి హాయిగా కాలంగడపేవారు. వారు ధన్యజీవులు. వీరికి ఒకడేకొడుకు, ఆరు, ఏడుసంవత్సరాలవాడు. పేరు గోవిందచరణశరణుసింగు. తలితండ్రులూ, వూరివారూ "గోవిందా" అని పిలుస్తూ గోవిందనామస్మరణచేస్తూ ముక్తులయ్యేవారు. ఏకపుత్రుడునూ, పిన్నవయస్కుడునూ అయిన గోవిందుని తలితండ్రులెంతటి గారాంతో పెంచేవారో వేరేవ్రాయనక్కర్లేదు. కుర్రవాడిని అయిదవఏట బడిలోవేద్దాంఅనే ఉద్దేశం వారికి కలిగినా గ్రామంలో బడిలేకపోవడంచేత, అడవిమార్గంనుంచి పై వూరిబడికి ప్రతిదినం పంపడం ఇష్టంలేక, అశ్రద్ధచేసి, ఒకటి రెండుసంవత్సరాలువూరుకుని, నలుగురి ప్రోత్సాహంమీదా ఒక సుముహూర్తాన అక్షరాభ్యాసంచేసి, తండ్రి రోజూ గోవిందుని స్వయంగా బడికితీసుకువెళ్లి,తీసుకువస్తూవుండేవాడు. చిన్నప్పటినుంచీ తల్లి చేస్తున్న పూజాపునస్కారాలనిచూసి ఆనందిస్తూ, తనకి తెలియకుండానే భక్తిఅనే సుగుణసంపత్తిని అలవరచుకుంటూ, కొంచెం జ్ఞానంఅబ్బేక, తల్లితోబాటు పూజాగృహానికి తానూపోయి ప్రార్థిస్తూ, ఒకనాడు, "అమ్మా! అస్తమానం కృష్ణమూర్తినిపిలిచి పాలూఅవీ ఇస్తావుకదా, అతనెవ్వరే. నాకియ్యకుండానే కృష్ణుడికి అన్నీపెట్టుతావుకాని......" అన్నాడు. యీ ప్రశ్నకి తల్లి కొంచెం ఉత్సాహపడి చిరునవ్వునవ్వి, పెద్దవిష

యాలు కుర్రవాడితో చెప్పతేమాత్రమేమి: ప్రయోజనంఅని గోవిందుతో, "బాబూ, కృష్ణుడు నీకు అన్నయ్య అవుతాడమ్మా. అందుకని అతనికి అలాచేస్తున్నాను. అన్నయ్య చాలా మంచివాడు. మనకి ఏమికావలసినా తెస్తూంటాడమ్మా" అంది.

గోవిం:_ అయితే అమ్మా, అన్నయ్య నాలాగ ఇక్కడ అస్తమానం వుండడేమి?

రాధ:—అస్తమానం ఇక్కడేవుంటె మరి బువ్వ ఎవరు తెస్తారునాన్నా మనకి?

గోవిం:_అయితే అమ్మా,అన్నయ్య నాకవుపించడేమి?

రాధ:—నువ్వెప్పుడూ అతన్ని పిలవలేదు కనుక. ఎందుకైనా అవసరంఅయితే పిలుస్తే పరుగెత్తుకొస్తాడు. ఊరకే పిలుస్తే రాడు.

గోవిం:—అయితే అమ్మా, రోజూనన్ను అన్నయ్య బడిలోకి దిగబెట్టకూడదూ? నాన్నకి బొత్తిగా తీరుబడిలేదని విసుక్కుంటాడు?

రాధ:—అవును సుమా నాయనా రేపటినుంచి అన్నయ్యని సాయంరమ్మను. వస్తాడు. నీకు భయంవేసినప్పుడల్లా కేకేస్తే వస్తాడులే.

గోవిం:—అయితే అమ్మా, అన్నయ్యని ఏమనిపిలవమన్నావు?

రాధ:—'అన్నా గోపాలా' అని.

గోవిం:—రేపలా పిలుస్తా. నాన్నని సాయంరావద్దనిచె ప్పు నాకు. నాకేం భయంలేదు. అన్నవుంటాడుకాదూ?

రాధ:—అలాగే నాయనా.

ఏమి యీరాధాదేవి ధైర్యం? శ్రీకృష్ణుడు తన పిలుపు కి పలుకుతాడా? ఏమిటియీభ్రిమ? ఏమైనాభక్తులుపిచ్చి వాళ్లు. లేకపోతే ఏకాలంనాడో పుట్టి పెరిగి గిట్టిన ఓవ్యక్తి ఇప్పుడుపి లుస్తే పలుకుతాడనుకోడంలో అర్థంఏమిటి? ఏమో. రాధకి త నభక్తిలో నంత దృఢమైన విశ్వాసం ఉందికాబోలు. విశ్వాస రాహిత్యమైన కార్యమెప్పుడూ సిద్ధింపదు.

మర్నాడు రాధాదేవి యథాప్రికారంగా తన పూజా పునస్కారాలు నిర్వహించుకుని శ్రీకృష్ణభగవానునికి పాలనా రగింపుచేసి, గోవిందుకి చద్ది భుజింపచేసి లాగూ చొక్కా తొ డిగి పలకా పుల్లాఇచ్చి బళ్లోకి పంపిస్తూ "బాబూ నీకు భయం వేస్తే అడవిదగ్గరమాత్రం అన్నని నేనుచెప్పినట్టు పిలు. వచ్చి బడివరకు దిగబెట్టి మళ్లీ ఇంటికి తీసుకొస్తాడు. ఏమీ భయంలే దులే. అన్న వుంటాడుకాదూ? పో" అని పంపించింది. గోవిం దుడు 'అన్నవుండగా నాకేం భయంఅమ్మా' అని పయనమ య్యేడు. ఊరుదాటేవరకూ గోవిందుడు దిక్కులుచూసుకుం టూనడచి, తర్వాత చిన్న చిన్న పొలాలు దాటేటప్పుడు, అ న్నని పిలవవచ్చును. అన్నని చూడేలేదు. యీవేళ చూస్తాన ని వువ్విళ్లూరుతూ వెళ్లి వెళ్లి, అడవిమార్గంలో ప్రివేసించేడు.

అడవిలో గుములుగా పెరిగివున్న చెట్లనీ పొదరిండ్లనీ వెదురు తోపులూ చూసి కొంచెం భయంపడి ఇక్కడ అన్నని పిలవాల ని వూహించుకుని ఒకచోట నాగి బిగ్గరగా "అన్నా గోపాలా, అన్నా గోపాలా' అని పిలిచేడు. పిలవడమే తడవుగా "బా బూ గోవిందా, వస్తున్నాను నాయనా భయపడకు" అంటూ గోపాలకృష్ణుడు గోవిందుకు ప్రత్యక్షమై "అమ్మ చెప్పిందని ని న్ను బడిలో దిగబెట్టమని. దా. రోజూ వస్తా. భయంలేదులే అమ్మా" అంటూ, అతన్ని తనదగ్గరగాతీసుకుని ముద్దుబెట్టుకు న్నాడు. ఎంతటి అదృష్టవంతుడే ఆగోవిందుడు. ఎంతటి ధన్యు రాలో రాధాదేవి. భగవంతుని తన పాలికాపుగాచేసుకున్న ఆమహాభక్తురాలి భక్తివిశేషం వర్ణించడానికి పటుత్వం ఎవరికి వుంటుంది? ఆభక్తిని నిరూపించేసరికి చెప్పేవాడుకూడా మహాను భవంకలవాడై, మహాభక్తుడై, ఆ అనుభవంలో, ఆ భక్తిలో చైతన్యం పోగొట్టుకుని శిలాప్రతిమ అవవలసినదే. తెప్పరిల్లి న పిమ్మటా? ఆ అనుభవానికి అక్కరలు వ్రాయడానికి మనసు శ్రీకృష్ణుని సాన్నిధ్యాన్నే వుంటుందికాదూ? ఇంకెలా వ్రాస్తా డు వ్రాయసలవికానిదాన్ని?

శ్రీకృష్ణుడీమాదిరిగా గోవిందుకి సోదరుడై, రాధాదేవికి ప్రథమపుత్రుడై లీలలుచేస్తున్న ఆనందదినాలలో ఒకనాడు బడి లోపిల్లలు నలుగురైదుగురు తగవులాడుకుని తన్నులాడుకుం టూ ఇంటికి వంటరిగా వచ్చేస్తున్న గోవిందుమీదపడి అతన్ని పడతోసేసేరు. పాపంగోవిందుకి చిన్నగాయం తగిలింది, పలకబ

ద్దలై పోయింది; క్రొత్తగా దీపావళికి కుట్టించుకున్న పట్టుచొక్కా చినిగిపోయింది, ముఖమాలుటోపీ తలమీదనుంచి ఎగిరి దూరానవున్న కళ్లుకాలవలోపడి బురద్దై పోయింది. తతిమ్మా బడి పిల్లలు వీడిగోడ వేకొానకుండా ఎవరిఇళ్లకివారు పోయేరు. పడినందుకు, గాయపడినందుకు, ఆట్టేచింతించలేదుకాని గోవిందు, పలకబద్దలైందని, చొక్కా చినిగిందనీ, టోపీ పాడైందనీ వాళ్లఅమ్మ ఏమిచీవాట్లుపెట్టుతుందో, అజాగ్రితఅని ఏమికొట్టుతుందోనని భీతిల్లి వెక్కి వెక్కి ఏడుస్తూ ఇంటిమార్గంపట్టి, మామూలుగా తాను శ్రీకృష్ణుడిని పిలచేచోటనాగి ఇటూఅటూచూసి, 'అన్నా గోపాలా, అన్నా గోపాలా' అని ఎలుగెత్తేడు. ఆదయాస్వరూపుడు, కరుణామయుడు గోవిందుకు ప్రత్యక్షమై 'తమ్ముడూ, ఏమమ్మా ఏడుస్తున్నావు? అయ్యో పడ్డావా? పలకచిటికిందా? చొక్కాకూడా చినిగిపోయిందా బాబూ? ఛీ! ఛీ, టోపీ ఏమిటిఅలాఅయిపోయింది? అప్పుడు నన్ను పిలవలేకపోయేవా?" అన్నాడు.

గోవిం:—అమ్మ కొడుతుందనే భయంలో నీమాట జ్ఞాపకంరాలేదు. నేను ఇంటికిపోను. నీతోవచ్చేస్తా. అమ్మ తంతుంది.

కృ:—వెర్రివాడా. అమ్మ అంతకఠినురాలుకాదు. ఏమీఅనదు. ఒక్కక్షణం ఇక్కడే ఆగు. నీకు ఇవిఅన్నీ తెచ్చియిస్తానంటూ అడవిలో మాయమై, ఓ పదినిముషాల్లో తిరిగివచ్చి గోవిందుడుకి కొత్తచొక్కాతొడిగి, కొత్తటోపీవేసి, కొత్తపలక చేతికిచ్చి ఇంటివరకూ దిగబెట్టి ముద్దెట్టుకుని "బాబూ,

ఇంకపో, అమ్మ ఏమీ అనదులే" అని అంతర్ధానమయ్యేడు. గోవిందుడు, తనకి గోపాలుడు అన్నయ్య అయినందుకు వేయిగా సంతోషించి అతనిపైన భక్తివిశ్వాసాలు ప్రకటిస్తూ వుండేవాడు. ఆహా ఏమి యీచోద్యము? అవతారపురుషుడైన శ్రీకృష్ణభగవానుని చోద్యంపుచైదము లెంతగా నాతని ప్రేమతత్వాన్ని ప్రకటిస్తున్నాయి? యీకాలంలోమాత్రం కృష్ణుడు ప్రత్యక్షంకాడా? రాధాదేవివంటి భక్తులువుంటే ఎందుకుకాడూ? జరిగిన చిత్రకథసంతా పూసగుచ్చినట్లు చెప్పేడు గోవిందుడు తల్లికి. రాధ, గోవిందుని కౌగిటచేర్చుకుని "బాబూ నువ్వెంత అదృష్టవంతుడవోయీ. గోపాలుడు నీకు అన్నయ్యఅవడం నీ భాగ్యమేకాదు, నాభాగ్యమును. అతనిని మరవకుసుమా. అతనికి నీనమస్కారాలు మానకుసుమా" అని బోధించివచ్చే ఆనందబాష్ప ప్రవాహాన్ని ఇచ్ఛవచ్చినట్లూ ప్రవహింపనిచ్చి, పూజామందిరానికిపోయి శ్రీకృష్ణభగవానుని వాత్సల్యానికి కృతజ్ఞతదెల్పే కీర్తనలుపాడి, తన్మయత్వమునొంది మురళీనినాదాన్ని మరోసారి విన్నది. "రాధాదేవీ, ఏమమ్మా నీపూజాఫలమూ. ఆదేవకీదేవికైనాపట్టని యదృష్టమమ్మానీది. నీధన్యచరిత్రను మానవులెరింగియుండిన నీవలెనే వారునూ భక్తులై ఆనందసాగరాన విహారిస్తు, తుచ్ఛమైన దైహికవాంఛలను మరచియుందురేకదా."

కొన్నిసంవత్సరాలిలా గడచేయి. రాధాదేవి కుటుంబానికీ, గోపాలుడుకీ దినదినాభివృద్ధిగా వాత్సల్యం పెరిగింది. ఇంతలో, రూపనగరానికీ, మరి ఇతరపట్టణాలకీ జమీందారుడై

న భూపేంద్రమహారాజులుంగారి పట్టాభిషేకమహోత్సవం జరు గుతోంది. తన జమీలోని గ్రామాలన్నీ అలంకరింపచేసేరు. రాజధానిలో మహావైభవంగా వుత్సవాలు చేస్తున్నారు. నగ రవాసులు తదేకదీక్షగా యీ శుభదినసాన్ని జమీందారుని జీవితచరిత్రలో పరమపవిత్రమైనదిగా, ఆనందింపతగినదిగా నుం డేటట్లు వేడుకలు జరుపుచున్నారు. పట్టాభిషేకముహూర్తాన నజరానాలని ప్రతీగృహస్తుడూ గొప్పగానో కొద్దిగానో శక్తికి తగిన బహుమానాలని పట్టుకువెళ్లేరు. కొందరు రత్నాలు, వ జ్రవైఢూర్యాలు, బంగారుకాసులు ఇచ్చేరు. కొందరు ఏనుగు లని, గుర్రాలని, లొటిపెట్లని కానుకలిచ్చేరు. కొందరు రకర కాల సారట్లు, పల్లకీలు ఇచ్చేరు. కొందరు వ్యవసాయదార్లు ది వాణానికి వలసిన పంటలన్నీ తెచ్చి రాసులుగాపోసేరు. ఇలాగ్గా తలోమనిషీ ఏదోమాదిరిగా తమప్రభువుకి తమభక్తివిశ్వాసా లు ప్రకటించుతూవచ్చేరు. గోవిందుకుకూడా ఏదైనా నజరా నా రాజుకి ఇద్దామనేఉద్దేశం కలిగింది. పాపం చాలా బీదవా డు, ఏమియ్యకలడూ? తనకోరిక తల్లితోచెప్పేడు. "మనం ఏ మిఇయ్యకలంనాయనా, మనమే ఓమార్గంగా కాలంవెళ్లబుచ్చు కుంటున్నాం" అంది. కాని గోవిందుడు చాలా మారాంపెట్టే డు ఏదైనా పట్టుకువెడతానని. "అయితే అన్నయ్యానే అడు గు, నన్ను బాధపెట్టకు" అంది రాధ. యీమాట వినడమే తడవుగా పర్వెత్తివెళ్లి గోవిందుడు 'అన్నా గోపాలా' అని ఆ తృతగా అరచేడు. వచ్చేడు అన్నయ్య, తమ్ముడిదగ్గరకి. తనకో రిక విన్నవించేడు గోవిందు. "ఇదెంతభాగ్యంబాబూ, ఏదైనా

కట్టుకు వెడుదువు కానిలే" అని సంతోషంగాపలికి, ఓచిన్న మ ట్టిపాత్రితో గట్టిరాయిలాంటి పెరుగు వుట్టిలోపట్టుకువచ్చి "దీ నిని మీరాజుకియ్యి" అనిచెప్పి పంపేసేడు. నజరానాలిచ్చే వేళకి గోవిందుకూడా కోటలోకి అన్నయ్యఇచ్చిన కొత్తలాల్చీ, కొ త్తటోపీవేసుకుని, చేతులో పెరుగుపాత్రివున్న వుట్టిపట్టుకుని స సంబ్రింగా సగర్వంగా వెళ్లేడు. "ఎవడో వెర్రిగొల్లాడు వీడు పెరుగుపట్టుకుని వెడుతున్నాడు రాజుగారికి బహుమానం, ఆ యనకి యీమాత్రిం పెరుగులేదనికాబోలు"నని చూసినవాళ్లు నవ్వుతూవచ్చేరు. "మాఅన్నకి ఆమాత్రిం తెలియదా" అను కుని గోవిందుడు తనదారిని తానుపోయి రాజుగారికెదురుగా ని లుచున్నాడు. ఆయన పాదాలదగ్గర ధనరాసులు కుప్పలుపోసి వున్నాయి. బహుమానాలన్నీ భవనంనిండావున్నాయి. ఖిల్లే దారుడు వ్రాసుకున్నాడు నజరానాలిచ్చిన వారిపేర్లు. అమా యకంగా గోవిందు రాజుచేతికి తనబహుమానం అందిచ్చేడు. పట్టరానికోపం వచ్చింది రాజుకి. తీక్షణంగాచూసి గోవిందుని బెదరగొట్టేడు. పసివాడని మళ్లీ జాలిపడి పాత్రినందుకుని 'సె భాస్‌రా ఒరే, నువ్వుఇచ్చిన బహుమానంలాంటిది మరెవ్వరూ ఇయ్యలేకపోయినారురా. నాభవనం నిండిపోయిందిరా నీపెరు గుతోటి' అని వేళాకోళం చేసేడు. తన అనుచరులంతా నవ్వే రు. చిన్నపోయినాడు గోవిందు.

ఆమర్నాడు నగరవాసులకు విందుచేసేడురాజు. లక్ష లాదిగా జనులువచ్చేరు. నానాజాతులవారూ తృప్తికరంగా పం

చభక్ష్యపరమాన్నాలతో విందారగించేరు. తమసంతోషాన్ని వెల్లడిస్తూ, కోలాహలంచేస్తూ, శ్లోకాలుచదువుతూ, గీతాలు పాడుతూ, ఎంతో ఉత్సాహంగా వున్నారంతా. ఆఖరునపెరుగు వడ్డించేరు. స్వయంగా తణిఖీచేస్తున్నరాజు, ఖిల్లేదారునిపిలచి 'రూపనగరవాసి ఇచ్చినపెరుగు వడ్డించ'మని ఆజ్ఞాపించేడు. వుట్టివిప్పి, మట్టిపాత్రికి కట్టివున్న గుడ్డనివిప్పి, ఖిల్లేదారుడు ఒకరివిస్తరిలో పాత్రిపళంగా వంచేసేడు. పాత్రిఆకారంగా గట్టిపెరుగు వడ్డింపపడింది. పాత్రినుండి పెరుగు పడీపడడంలో మహాశ్చర్యంవేసేటట్టు అనుపమానమైన, అపురూపమైన పరిమళంభవనం అంతా వ్యాపించింది, నగరాన్ని వ్యాపించింది, విశ్వంఅంతా వ్యాపించింది. ఆపరిమళంయొక్క తీయదనం, స్వాదుతనం వర్ణించడానికి శక్యంకాదు. దేవతాలోకంలోవున్న దేవులకి కూడా ఇట్టిది చోద్యంగానేవుంటుంది. ఆపరిమళంలో మిళితమైన అమృతప్రేమ జనులనాకర్షించింది, మురళీధరుని మురళీగానం సమస్తలోకాలనీ ఆకర్షించినట్లు ఆశ్చర్యచకితుడై నిలచుండిపోయేడు రాజు. విస్మయంచెందేరు ప్రజలు. నిర్ఘాంతపోయి పాత్రికాసిచూస్తున్నాడు ఖిల్లేదారుడు. ఏమా, వడ్డించినపిదపకూడా పాత్రి ఎప్పటివలెనే నిండివుంది. ఒకరితరువాత నొకరికి వడ్డించేరు, వచ్చినజనానికి. అప్పటికీ అది నిండుగానేవుంది. అధమం రెండుమూడులక్షలజనం చవిచూసేరుదాన్ని. అయినా అక్షయ్యంగావుండిపోయిందది. విందారగించినవారూ ఆరగించనివారూ దానిరుచిని అనుభవించి ముగ్ధులైపోయేరు. ఆఒక్కక్షణంనూ ప్రపంచంలో విషాదంఅనే గుణానికి మృతిసంభవించి,

ఆనందమనే తత్వానికి అమృతవరాన్ని ప్రసాదింపబడింది. ఆ ఆనందంలో లోకాలు విహారంచేసేయి; ఆ ఆనందంలో అవి తన్మయమందేయి. ఆ ఆనందంలో ఆనందమయమూర్తి, ఆదితేజోమూర్తియొక్క ప్రేమస్వరూపం ఒక్కమ్మడి పొడగట్టింది. రాజు తన అదృష్టానికెంతసంతోషించినా తాను గోవిందుని హేళనచేసిన తనమూర్ఖత్వానికి వగచి, పశ్చాత్తాపంపొంది, వెంటనే గోవిందునిపిలచి మర్యాదాచేసి, 'అబ్బాయీ, నీకు యీ పాత్ర నెవరిచ్చిపంపేరు'అని ముద్దుగా అడిగేడు. గోవిందు 'మా అన్నయ్య ఇచ్చిపంపేడ'ని అమాయకంగా జబాబుచెప్పేడు.

రాజు:—(ఆశ్చర్యంగా) మీా అన్నయ్యా! మీా అన్నయ్యా! ఎవరాతనిపేరు.

గోవిం:—గోపాలుడు.

ఆశ్చర్యంగా చూసేడురాజు; ఏమో, అతనికి గోవిందు అసత్యంపలుకుతున్నాడనే అనుమానం వేసింది; యీామాదిరి అక్షయదధిపాత్ర యీామానవప్రపంచంలో సృష్టింపపడిందికాదని తాను గ్రహించేడు. ఇంకా విషయం వివరంగా తెలుసుకుందామని, గోవిందు శిరసు నిమురుతూ.

రాజు:—మరి మీా అన్నయ్య ఎక్కడవుంటాడు, ఎలాగవుంటాడు? అని అడిగేడు.

గోవిం:—మా అన్నయ్య మాఊర్లో తోటలో వుం

టాడు. చక్కగా బాగుంటాడు. అదోరంగుగావుంటాడు. ఎప్పు డూ పట్టుబట్టలే కట్టుకుంటాడు నాకూఇచ్చేడు. అతనికళ్లంత పెద్దకళ్లు మీకెవ్వరికీలేవు. ఎన్నోవస్తువులున్నాయి కూడాను. తలమీద నెమలిపింఛం ఎప్పుడూవుంటుంది. ఇంకా మాఅన్న య్య మురళితోఎంతో బాగా పాడతాడు.

రాజు:—(ఉత్సాహం, ఆత్రముతో) నాకు చూపిస్తా వా మీఅన్నని?

గోవిం:—ఆ. రండి నాతో మాఊరు.

రూపనగరానికి వెళ్లేరు రాజుగారూ, పరివారంనూ. అ తనివెంబడి లక్షలాదిగా జనులుకూడా పోయేరు. అంతా విం టూండగా, గోవిందు తన మామూలుప్రదేశంనుంచే 'అన్నా గోపాలా' అని పిలచేడు. అన్నయ్యరాలేదు. తెల్లబోయ్యేడు గోవిందు. అతని పిలుపుని గోపాలుడెన్నడూ నిర్లక్ష్యంచెయ్య లేదు. మళ్లీపిలచేడు. పలకలేదు. ఇంకోమాటుకూడా పిలచే డు, అయినా జబాబులేదు. "అన్నా గోపాలా, నువ్వురాకపో తే నేచెప్పింది అబద్ధంఅనుకుని అంతానవ్వుతారు ఒక్కమాటు రావూ" అని ఏడుస్తూ ప్రార్థనపూర్వకంగా పిలచేడు గోవిందు. ఆకాశంవంక చూసేరుప్రజలు. బ్రహ్మాండం నిండిన మహాతే జస్సొకటి అక్కడ కనిపించింది. నిర్మలమయిన మలయమారు తంలో వీచిన తీయని పరిమళం, అక్షయదధిపాత్రనుండి వీచిన దానిమాదిరి, అంతటా వ్యాపించింది.మురళినుండి, విన వేడుక

ష్టస్టే, మధురాతి మధురమైన, ప్రేమగీతాలు వినిపించి అమృతబిందువులులాగ వారివారి హృదయాల్లో ఆనందం స్ఫురింపజేసేయి. ఒక్కుమ్మడిగా జనులంతా అట్టహాసంచేసి తమకు తన స్వరూపంతో దివ్యదర్శనం ప్రసాదింపమని శ్రీకృష్ణుని ప్రార్థించేరు. అదృశ్యుడైన ఆ దేవదేవుడు భారతగీతాలని ప్రేమగీతాలని మరల మరల వినిపించేడు. ప్రపంచం అంతా అమృతస్వరూపందాల్చిపోయిని మరలమరల చవిజూసింది. కొంత సేపటికి మురళీనినాదం ఆగింది. "అన్నా, వచ్చి మాకు కనిపించు" అని గోవిందుడు మళ్లీ ప్రార్థించేడు. అదృశ్యుడైన కృష్ణుడు, తమ్ముడూ, నేనువీరందరకూ కనిపించను. మీరాజు ధనదాసుడు. ప్రజలునూఅంతే. ప్రేమపూర్వకంగా నీవర్పించిన కానుక స్వల్పమైనదనే భావంతో నిన్ను ఎంతగా హేళనచేసేడో తెలియదా? ధనధాన్యుల నర్పించిన సామంతరాజులకి అర్ధసింహాసనమిచ్చి గౌరవంచేసేడు. మీ ఇరువురిపట్ల నతనికి సమదృష్టి లేకపోయినది. ఎందులో ఎంతనిజమైన ప్రేమవున్నదో గ్రహింపలేకపోయినాడు. వస్తువుయొక్క విలువకే ప్రాధాన్యమిచ్చినాడు కాని అందు మిళితమైన ప్రేమకికాదు. ఇంకనూ తాను నాప్రేమతత్వాన్ని అలవర్చుకోవలసి వున్నది. అంతవరకూ నేనాతనికి ప్రత్యక్షం కాను. వారువెడలిపోయిన పిమ్మట నీతోవచ్చి మాట్లాడుతానులే" అన్నాడు.

రాజు యీ మాటలువిని ఖిన్నుడై, శిరసు వాల్చుకుని పశ్చాత్తాపవడి దీనంగా, తన యావజ్జీవమును ప్రేమరహితంగా

వృధాపుచ్చితినే అని విలపించి, రాధాదేవి గృహానికేగి, ఆమె పూజాగృహం దర్శించి ఆమెభక్తికి పారవశ్యమంది, "అమ్మా, మీరు నారాజధానికి రండు. మీకేమి లోపములేకుండా సంరక్షించుతాను"* అన్నాడు.

రాధ:—రాజా! నీ అభిమానానికి కృతార్థురాలను. నేను నాగోపాలుని విడచి ఒక్కక్షణమైన వుండలేను. గోవిందుడూ అంతే. మాకు వలసినవన్నియూ మాగోపాలుడే ఇచ్చుచున్నాడు. మాకేమీ లోటులేదు. మీ ఆహ్వానము నంగీకరింపలేదని కోపమువలదు. మాకు మా గోపాలుడే శరణ్యాము, మారక్ష, మా ఇలువేల్పు, మానవసేవయే తనసేవగా నంగీకరించువాడు. నీవదిచేయుము, భక్తితో నీసర్వమూ తని కర్పింపుము.

రాజు:—అమ్మా! ఆ మహానీయుని ప్రేమతత్వాన్ని గ్రహించితిని. దానికి మీరే నాగురువులు. ఆ దేవదేవుని ధ్యానింపుచూ మిగిలిన కాలము నాతనిసేవలోనే గడుపుచూ, నాతని ప్రేమతత్వాన్ని క్రియారూపంగా పరిణమింపజేస్తాను. ఆశీర్వదింపుడు.

రాధ:—రాజా! ధన్యుడవౌదువులే.

---

* ఈకథలోని పరిభాషాంశము సిస్టరు నివేదితావ్రాసిన గ్రంథములో చదివినట్లుగా మామిత్రులొకరు చెప్పగావిని దీనిని అల్లితిని.



# మా వ్యాఘ్రం

మా వ్యాఘ్రం కొన్నేళ్ళక్రితం ఓఊళ్లో బోర్డుఇస్కూలు హెడ్డుమేష్టరీ వెలిగించిన దినాలు జ్ఞాపకానికొచ్చి, యీ గాథ అంతా ఎత్తుకున్నాను. ఏంపెట్టి పుట్టేడో కాని మహానుభావుడు ఆ వ్యక్తికా ఉద్యోగం ప్రత్యేకం తనకోసమే పుట్టినట్టుగావుంది. చేస్తే ఆపని అతనే చెయ్యాలి, అలాంటి ఋణసంబంధం తనకీ ఆమేష్టరీకీన్నీ. పేరుమాత్రం గొప్పదైనా గుణానికిమాత్రం ఉత్త పిల్లి; "ఉ" అంటే ఉలిక్కిపడతాడు. జడిపిస్తే జ్వరం తెచ్చుకుంటాడు. గోటుగామాత్రం "నాపేరు వ్యాఘ్రేశ్వరశర్మ" అని చెప్పుకుని విరగపడతాడు. అతనిది అసలు గోదావరిజిల్లాలో ఓ మన్యగ్రామం. ఇతను తలకి బండిగూడు చేయించి వెనకాల అసిరమ్మముడి వేసుకుని చెలుగుడిఆడే సరదారోజులిప్పటికీ నాకళ్లకట్టినట్టుంటాయి. ఆ రోజుల్లో ఆ గ్రామాలవాళ్లు రైలుప్రయాణం చెయ్యవలసివస్తే విల్లులువ్రాసుకుని అందరదగ్గరా కడసారిశెలవులు తీసుకుని పయనమయ్యేవాళ్లు. గోదావరబ్రిడ్జి పడిపోతుందనే భయంవుండేది వాళ్లకి. చొక్కాకర్మం చాలక వేసుకుంటే ఉక్కిరిబిక్కిరై అందులో ఎలాగు దూరేన్రాదేవుడా, ఎలాగ బయటకివచ్చి మళ్లీ నలుగురిలోనూ పడడం అనే చింతలోపడి పిచ్చెత్తి చొక్కాని చింపి ముక్కలుచేసుకునేవాళ్లని నేనెరుగుదును. కోటుతొడుక్కోవలసిన అవాంతరమే తటస్థించుతే ఏబొత్తాం ఏకాజాలో వుంచాలో తెలియ

క అవకతవకగా సర్దిన ఘరాణావాళ్లు ఎందరో. తెల్లదొర కనపడితే మగవాళ్లు సహా బేజారై తలుపులు మూసుక్కూచునేవారు. తెలుగువాడే దొరవేషంలో కనపడితే ఏదోజంతువు చుట్టుపట్ల వనాలనించి దారితప్పివచ్చిందన్నట్టుగా గుడ్లుమిటకరించి చూసేవాళ్లు. ఇలాటివాళ్లమధ్య పుట్టిపెరిగినవాడు మా వ్యాఘ్రంను. చాలా తెలివైనవాడు; వేదాంతి. తండ్రి ఘనాపాటి, తల్లి సుగుణవతి. భ్రాతలు మాత్రం అగస్త్యభ్రాతలే. యల్. టీ వరకూ రాజమండ్రిలోనే చదువుకుని అక్కడే ఆక్టింగుగా ఇస్కూలు మేష్టరీగా ప్రవేసించి ట్రాన్స్ఫర్ మీద ఎన్నో ఊళ్లుచూసేడు. వెళ్లినచోటల్లా. "అవున" నిపించుకుని కాలక్షేపంచేసేడు. దీనితోబాటు మాంచి ఆస్తికూడా ఓవితంతు మేనత్తద్వారా కష్టంమీద అబ్బింది. కాని అప్పట్లో అతని విచారం అల్లా తనకి వయసువచ్చినా పెళ్లికాలేదని. తన గోడంతా నలుగురితో చెప్పుకు ఏడ్చి ఏడ్చి ఎలాగైనా మంచి సంబంధం, ఎదిగినపిల్లనీ కుదిర్చి చెయ్యమని వీరినీ వారినీఅనక ప్రతీవాడినీ బ్రతిమాలుకునేవాడు. జ్యోతిషం చెప్పించుకునేవాడు. త్వరలో వివాహం అవగలదని చెప్పిన జ్యోతిష్కుడిని అతడు ఆదరించందే పంపేవాడుకాదు. ఎవరేనా ఇప్పుడు పెళ్లికాదని చెప్పేరా, ఆ వేళ అతనికి బడితబాజాలే బహుమానం. పెళ్లమేలోగా మాత్రం కనిపించిన కన్నెపిల్లల్లా తనపెళ్లాంగానే భావించుకుని తృప్తిపడేవాడు. ఎలాగైతేనేం పెళ్లిఅయింది. అయిదోరోజు పెళ్లినాడుమాత్రం ఎంచేతో విచారంగా ఒంటరిగా కూచున్నాట్ట ఓకొట్లో. "సుఖంమల్లే అలావిచారంగా వు

టూ వేమిటా?" అని తల్లి అంటూంటే లక్ష్యంచెయ్యలేదు. కారణం తెలియక నలుగురూ తలోమాటా ఆడేరు. ఆఖరికి తన ప్రాణస్నేహితు డొకడిని పిలచి చెప్పేడు ఆ విచారానికి కారణం. పురాండం పిచ్చిసూరయ్యగారి కొడుకులాగ, తనకి రేపుపుట్టబోయే కొడుకుకూడా తనపెళ్లాన్ని సరిగ్గా ఏలడేమోననిట. "నీకు బుద్ధివుందా లేదా, నీభార్యా పెద్దమనిషయ్యి, తర్వాత పునస్సంధానం అయేక నిన్ను బాగా ఏలుకుని సరళంగా సంసారం చేసేక ఆలోచించుకోవచ్చులే' అని ఆ స్నేహితుడు చీవాట్లుపెట్టేవరకు అతనికా విచారం పోలేదు. అతనికి కోపంవుందని ఎవరూ చెప్పలేదుకాని, యీ మధ్యనే అతనికి ఓ చిన్న అవమానం జరగడంచేత, అలా అవమానంచేసిన అయిదుసోల్ల సూరమ్మఅంటే తనకి ముక్కునిండా కోపంవస్తుంది. ఇంతకీ ఆవిడచేసిన మహాపరాధం ఏమంటే, ఒకనాడు సాయంత్రం షికారుకని బయలుదేరి వ్యాఘ్రం చుట్టుచంగాయపంచ కట్టుకుని, లక్కుంచువాణీ వేసుకుని, భుజాన్న క్రతగిలించుకుని, ఇస్త్రూళ్ల మేష్టరీదర్జా అంతాతనలోనే మూర్తీభవించినట్లు వీధిలోనడుస్తూంటే సూరమ్మగారు చూసి మర్యాదాగాలేచి ఇంట్లోకిపోకపోవడమేకాకుండా, అలాపోబోయే ప్లీడరుగుమాస్తా భార్యని ఆపి"ఇస్త్రూళ్లపంతులే కాదుటే, లేవడం ఎందుకూ" అని సణిగిందట. "ఆడదై పోయింది, లేకపోతేనా......" అంటాడు వ్యాఘ్రం. అతడు మహాపిరికి. హద్దూ మిద్దూ లేదా పిరికితనానికి. అందుకనే అస్తమానం "ఆంజనేయం ప్రసన్నాంజనేయం" అంటూంటాడు. ముఖ్యంగా మూడువ్యక్తులు యీ ప్రపంచంలో

అతన్ని గాభరాపెట్టి గల్లంతుచేస్తాయి అంటారులంతా. ఒకటి దెయ్యం, రెండూ సర్పం, మూడూ తనజిల్లా ఇస్కూళ్ల ఇనస్పెక్టరు. ఆయన నాయుడు, బ్రాహ్మణద్వేషి. అందుకని. నేను చెప్పుతూనేవున్నాను సాతాడి చిరంజీవులుతో. "అయ్యా, మావాడికి కొంచెం గుండె బెదురుంది, దెయ్యాలకబుర్లుమాత్రం చెప్పకండి." అని. వింటేనా? ఆశుంఠ. "చచ్చినవేం జేస్తాయి లెండి" అంటూనే రాజాంకీ చీపురిపల్లికీ దారిలోనున్న చింతతోపులో సాయంకాలంపడేసరికి, దెయ్యాలు మనుష్యులమల్లేనే తిరుగులాడుతూ, గోలపెడుతూ, నిప్పులుచిమ్ముతూ, వికృతాకారాలతో పిరికివాళ్లని కనిపెట్టి పెరుక్కుతింటాయ"న్నాడు. మావాడు సగం నీరుగమ్మేసేడు. "చెప్పొద్దయ్యా" అంటూనే వున్నా. వినలేదా మూర్ఖుడు; ఇక నారంభించేడు చెప్పడం తన అనుభవాన్ని. రాజాం వెళ్లేడుట కోర్టుపనిమీద. సాయంత్రం అయేక పని పూర్తి అయిందట. వెంటనే చీపురుపల్లి రావాలి. ఆఖరుబస్సు తప్పిపోయిందిట. వెళ్లకతప్పదని, గుండెనిబ్బరం కలవాడవడంచేత నడక పుచ్చుకున్నాట్ట, ఎంతమందిచెప్పినా వినక, పెరుమాళ్లుని తలుచుకుంటూను. రాత్రి ఎనిమిదైందట చింతతోపు సమీపించేసరికి. ఓమైలుదూరంలో ఓచిన్న మంట కనిపించిందట. ఆమంట అక్కడక్కడే చెంగుచెంగున గంతులేస్తోందిట. చూసేడు చిరంజీవి. "ఇదేరా దెయ్యాలగూడెం" అనుకుని వేగరంగా నడచేడుట. ఇంతలోకీ "కూ-కీ-కూ-కూం" అనే కూత వినిపించిందిట; ఏమిటాఅని వెనక్కితిరిగిచూసేడు. అట్టహాసంచేస్తూ ఓపెద్ద నవ్వు వినిపించిందట. చూస్తూండగా

సే తనకి పదిగజాలదూరంలో ఓపల్లకీని పన్నెండుదయ్యాలు మోస్తున్నాయిట. “కొవ్వోం, కొవ్వోం, ఉ” అంటూను. ఆ పల్లకిలో ఓఅందమైన ఆడదయ్యం సింగారించుకుక్కూచుందట. చుట్టూ కాగడాలుపట్టుకుని వికృతస్వరూపాలతో నాలుగుద య్యాలు, శాకాఊదే అఘోరకం మహాదెయ్యం, బాజాభజం త్రీలువాయిస్తూ ఓపదిమొగదెయ్యాలు, స్వస్తిమంత్రాలుచె ప్పుతున్న ఇరవై మొగబ్రాహ్మణదయ్యాలు, పల్లకీకిముందు రెండువరసల్లో నడుస్తూను, ఉన్నాయిట. కొంచెం భయంతో నూ, కొంచెం వింతగానూ చూస్తూఉండిపోయేడు చిరంజీవులు. ఇంతలో పల్లకీలోకూచున్న దెయ్యం పల్లకీ ఇతనిముందరగా ఆపించి, అందులోంచిదిగి అతివయ్యారంగా నడుస్తూ, అమాం తంగా చిరంజీవులి చెయ్యిపట్టుకుని “నిన్ను నేను పెళ్లాడుతాను, నన్ను నువ్వు పెళ్లాడుతావా చంపెయ్యనా” అని అధార్టిగాఅ డిగిందట. ఇప్పటికీ చెప్పుకొస్తాడు చిరంజీవులు ఆవ్యక్తిఅందం అపురూపమని, ఆకంఠస్వరం అతిమాధుర్యమనీ ఆనాటికీ యీ నాటికీ అలాంటి అందకత్తెని తాను చూడేలేదనీ, నిజంగా తన ని మోహించివచ్చిన మోహినీఅవతారం అనీ బహుశః రాచ పిశాచం అయివుంటుందనిన్నీ. తానుపెళ్లాడిన జోగాయమ్మమీ ద తనకి కోపంవస్తే “నువ్వుచస్తే, దయ్యంఅయినా ఆరాచపిశా చాన్ని పెళ్లాడి సుఖంగావుంటానే” అంటాడు. అతనుచెప్పే యీవిచిత్రకథలో మావ్యాఘ్రంమాటే మరచిపోయి సరదా గా వింటున్నాను చిరంజీవి చెప్పుతున్నది. చిరంజీవి అన్నాడుట దెయ్యంతోటి, “అమ్మాయీ నాకు పెళ్లిఅయిపోయింది” అని.

దయ్యం:—నీశార్ధం. అమ్మా యీయేమిటీ? నీఅంత కొడుకున్నాడునాకు. నీకు పెళ్లి అయినాసరే, నువ్వుచచ్చినాసరే నిన్ను పెళ్లాడితీరుతాను. కట్టుపుస్తి, ఇదిగో" అని పుస్తి చేతికిచ్చిందిట. "వాయించండరా! బాజాలు" అని ఆజ్ఞ ఇచ్చిందిట. బాజాలువాయించేరు, ప్రళయకాలంనాటి ఉరుముల్లాగ. భయం తారకంఎక్కి, ఉండీలేనిస్మారకంతోటి రాచపిశాచానికి పుస్తికట్టేసేడు చిరంజీవులు. అంతట్లోనే నాలుగుదయ్యాలువచ్చి అతన్ని ఎత్తుకుపోయి పల్లకీలో కూచోపెట్టేయిట. తనఎదురుగుండా దయ్యప్పెళ్లాం కూచుని తనఅందమైనచేతులు చిరంజీవికంఠానికి పెనవేసి గట్టిగా అదుముకు పట్టుకుందిట. అప్పుడే అతనికి స్మారకం తప్పిపోయిందట. కాళ్లుమాత్రం అటు తిరుగున్నాయి దెయ్యానికి అంటాడు. తెల తెల వారు సమయాన్న దయ్యాలన్నీ చెల్లాచెదరిపోయేయిట. ఆడదెయ్యం చిరంజీవులుని అమాంతంగా ముద్దగాచేసి మూటగానెత్తి "ఇంక పో" అంటూ ఒకశే విసరు విసరిందిట. ఉదయాన్నే లేచిచూస్తే, ఒళ్లునొప్పులుతోటి చీపురుపల్లి రైలుస్టేషనుకి దగ్గరగా రైలుపట్టాలమీద పడివున్నాడుట. "విన్నావోయ్ వ్యాఘ్రం యీచిత్రం" అన్నా నేను. ఇంకెక్కడి వ్యాఘ్రం? గోడనానుకుని గుడ్లు తేలేసి కొయ్యబారివున్నాడు. నీళ్లుజల్లి తెప్పరిల్ల చేసేం. "అంతభయం ఏమిటోయ్" అన్నాను. చిరంజీవికథ చాలాభాగం విని విని పడమటింటికాసి చూసేడుట. కథ సరదాగా వింటూన్న చిరంజీవి పెళ్లాం గుమ్మాన్ని ఒరిగినించుందట. కొం

చెం కనుచీకటిగా వుండేమో ఆవిడనిచూసి దయ్యమే అనుకుని భయపడ్డాడుట. ఇంతటిది మావాడిగుండె నిబ్బరతనం.

మళ్లీ నెలలోపున, ఇస్కూళ్ల ఇనస్పెక్టరుగారు ఇస్కూలు ఇన్స్పెక్షనికి వస్తున్నట్టు కబురువుత్తరం వచ్చింది మావ్యాఘ్రానికి. వణుకుతూన్న చేతుల్తో విప్పి చదువుకుని కుర్చీలోంచిలేచి కంగారుగా హాల్లోకి, హాల్లోంచి వంటింట్లోకి, వంటింట్లోంచి మళ్లీహాల్లోకి విడిపోయిన గోచీతో, జారిపోతున్న జందెంతో, ఒంటినిండా ముచ్చెమటలూ పొయ్యగా పచారుచేసేడు వెర్రాడిలాగ. భార్య ధైర్యంచెప్పి, రాత్రి రాత్రి ఆఫీసుపవరణకని పంపింది. ఒంటిగంట రాత్రివరకూ ఆఫీసులోనే వుండిపోయి ఇన్స్పెక్షనుకి తయారై వున్నాడు. ఇన్స్పెక్టరుగారి కోఇల్లు ఏర్పాటుచేసేడు. ఆవూరు వ్యాఘ్రానికి కొత్త. బంట్రోతుసాహెబువచ్చి "ఆఇంట్లో పాములున్నాయి, ఇన్స్పెక్షనుకి అయ్యగారువస్తే పాముఖాటూలిసీ మరిరావాల" అన్నాడు. "అమ్మోపాములే" అన్నాడు వ్యాఘ్రం. "అక్కడేకాదుబాబూ, ఊరినిండా పాములే. ఇంతెందుకూ, మీ పెరటివెనకాల బొమ్మచెముడునిండా పాములే. యీ వూరికి మీరు కొత్తకనక అంతభయపడతారు కాని మాకు అలవాటేనండి. "ఎన్నిమాట్లు పామునాకాళ్లని చుట్టివేసిందో" అన్నాడు పంచాయితీకోర్టుగుమాస్తా. గుండెలు దడదడమని కొట్టుకున్నాయి మావాడికి. మారుమాటాడక ఇంటికిపోయి పడుకున్నాడు. మర్నాడు ఇన్ స్పెక్షను అయింది. ఇన్స్పెక్టరుగారికి విందులు అయినాయి,

అతను వెళ్ళిపోయినాడు. ఆఫీసులో రికార్డు మంచితాళ్ళతో బి గింపించి బీరువాలో పెట్టించి పది పదకొండుగంటల రాత్రికి ఇల్లు చేరుకున్నాడు వ్యాఘ్రిం. కోటూ చొక్కావిప్పి, వీళ్ళతోనూ వాళ్ళతోనూ ఇన్‌స్పెక్షనుకబుర్లు సరదాగా హడావడిగా చెప్పు కొస్తూ "అబ్బా ఉండండరా. తొందరగావుంద"ని పెరట్లోకి లాంతరేనుకోకుండా వెళ్ళేడు. రెండుమూడునిముషాలైంది. అం తా వరండాలోనేవున్నాం, అయ్యగారు ఇంకా వస్తారని చూ స్తూను. ఇంతలో "చచ్చేను, పాము" అని ఒకటేకేకపెట్టేడు వ్యాఘ్రిం; పెట్టేపెట్టడం ఏమిటీ, గుభాలున నేలమీద పడ్డాడు కూడాను. "అయ్యో" అంటూ, నగంపడుస్తూ, ఇంటిల్లిపాదీ, ఇరుగూ పొరుగూ రంయిమని పర్వెత్తివచ్చి మనిషినిచూసేం. పడుక్కునివున్నాడు, గట్టిగా ఊపిరితీస్తున్నాడు, చెమటలు క క్కుతున్నాడు, ఏడుస్తున్నాడు "పాముకరిచింది" అని. "ఎక్క డ" అని అడిగేరు. "కాలిమీద" అన్నాడు. కాని కాలిమీ ద కాటుజాడేలేదు. కాని చాలా కంగారుగావున్నాడు, హడా వడిచేస్తున్నాడు. మంచంమీదకి తీసుకివెళ్లి విసరేం. అంతా "అయ్యో" అంటే "అయ్యో" అంటున్నారు. చెప్పరానంత గగ్గోలుగావుంది. ఊరివారంతా పోగయ్యేరు. అతన్ని స్థాయిప రుద్దాంఅనిచూస్తే, అందరినీ బండబూతులు తిడుతున్నాడు. "ఏమిటిమీమొహాం. ఇంతపొడుగుంది, రెండుబారలు, అసలై న తెల్లతాచు, కళ్ళారచూసేను, ముందుగా కాళ్ళకి పెనవేసింది, తర్వాత కసుక్కుమని పొడిచింది. చూసినవాడిని చెప్పుతున్నా కాదూ." అంటాడు. "కొంచెం కారం నోట్లోకియ్యండరా"

అంది ఓఇల్లాలు. ఇచ్చేరు. "తియ్యగా పంచదారలావుంది ఇంకా ఇమ్మ"న్నాడు. అక్కడివాళ్లకి దానితో ప్రాణాలులేవు. ఇంతవేపాకుసమలమని ఇచ్చేరు. "చాలా తియ్యగావుంద"ని తామలపాకుల్లాగ సమిలేసేడు. తెల్లబోయ్యేరంతా, "కాటు కనిపించదూ" రక్తంరాలేదూ, నాడిబాగుందీ, బాగామాట్లాడుతాడూ ఇదేం పామర్రాఅని అంతా ఆశ్చర్యపోయేరు. "కొన్ని పాములుకరుస్తే అలాగే వుంటుంద"న్నాడు గంటి లక్ష్మినారాయణ. అవునంటే అవునన్నారు. మంత్రకాళ్లని పిలిపించేరు. మందువేయించేరు, కాని మనిషలాగేవున్నాడు. అంతా నిస్పృహచెందేరు. ఒహాళ్ల మొహాలొహాళ్లు చూసుకున్నారు. రాత్రి పన్నెండయింది. ఎంతకీ తెల్లవారదూ. వ్యాఘ్రుంభార్య, తిరుపతివెంకటేశ్వరస్వామికి మీదుకట్టింది, సింహాద్రిఅప్పన్నకి పలకసర్లు చేయిస్తానంది, ద్రాక్షారామభీమన్నకి లక్షపత్రిపూజ వప్పుకుంది, జగన్నాధతీర్థం సేవించుతానంది, సత్యనారాయణవ్రతం చేయిస్తానంది, రావిచెట్టుకీ వేపచెట్టుక పెళ్లిచేయిస్తానంది, తన భర్తకి నెమ్మదిగావుంటే. కాని వ్యాఘ్రుం అలానేవున్నాడు. ఇంతలోకీ ఎవడో చదువుకున్నాయన "పాములనరసయ్యకి వైరుఇద్దామన్నా"డు. "మహాబాగ"ని అతన్నే సైకిలిచ్చి పంపేరు. "ఏమిజబాబు తెస్తాడో భగవంతుడా" అని నోళ్లు వెలబుచ్చి చూస్తున్నారంతా. ఇంతట్లోకీ వచ్చేడాయన "అది పామేనా? లేక ఉత్తభ్రమా" అని అడిగేగుట నరసయ్యగారు. ఎంతో నిజంఅయితేనేకాని అది వట్టి భ్రమగా ఆయన తలవరుట. అంచేత అందరప్రాణాలు గట్టునపడ్డాయి; పాము

కాదేమోఅని ధైర్యంకలిగింది. ఇదంతావింటున్న వ్యాఘ్రాని కి పట్టరానికోపంవచ్చి "వాడిమొహం. పాముకాదట. నేనేం వెర్రికుంకనా? నాకామాత్రం తెలియదూ? పామో తాడో తెలియనివాడిని ఇస్కూళ్ళ హెడ్డుమేష్టరీ ఎలాచేస్తున్నాను." మీకు మతులులేకపోతె అవతలకిపొండి. అది పాము, పాము, పాము" అని గదిమేడు. "పోనీ చూద్దాంరండి, సంగతేమిటో, మీరెక్కడచూసేరోపాముని" అన్నాడు కరణం. "అదుగోరా, మాబాదంచెట్టుదగ్గర" అంటూ వాళ్లని వెంటబెట్టుకు వెళ్లేడు మావ్యాఘ్రం. కర్రలుచ్చుకుని అంతా ఇటూ అటూ తచ్చాడారు. పాముజాడేలేదు. ఇంతట్లోకీ నేనొకచోట చుట్ట చుట్టుకుని తెల్లగ పడివున్నదాన్ని కొంచెందూరంలో చూసేను. నిదానించిచూసి "అదిగోనరాత్రి పాము. మావాడిని కరచినసామిదే"నని అందరకీ దాన్ని చూపించేను. కర్రతోకొట్టి ఎత్తిపెట్టి వ్యాఘ్రానికీ చూపించేను. తెల్లబోయేడు వ్యాఘ్రం. సిగ్గుచేత తలవంచుకుని గబగబా ఇంట్లోకిపోయి పడుక్కున్నాడు. అది పాముకాదు. తన జందెమే. ఇన్స్పెక్షను అయినసందట్లో చొక్కావిప్పుతూ పెరట్లోకిపోయినప్పుడు, కుచ్చెళ్లల్లో పడిజారింది ఆజందెం. ఇప్పటికీ వ్యాఘ్రం తనఃగాజ్జతేణువుకుంటున్నప్పుడు జందాన్నిచూసుకుని అంతా జ్ఞాపకంరాగా నవ్వుకుంటాడు. అమాయకుడు, కాని చాలా దొడ్డవాడు. ఇంకావున్నాయి చెప్పవలసివస్తే.



# తొలిచూపు.

---

ఆమె పదునారువర్షముల లేబ్రాయపులేమ; పుత్తడి బొమ్మ, తొలకరి మెరుపు; అతడు నడియౌవనపు బిగినివింత సోయగముతో తళుకొత్తు నక్షత్రము, ప్రొద్దుపొడువున వెల్లనౌ వింతవెలుగు. పిన్నవయస్కురాలయ్యు నామె పవిత్రప్రేమచిహ్నమై యున్నది. యువకుడయ్యు గర్వితుడు కాక నాతడు సహజమైన ప్రసన్నతను ఉబికించెడి రూపవయస్సంపన్నుడై యున్నాడు. ఇరువుర కాపురము శిథిలమైన ఒక అనాధశరణాలయమున ఒక రెరుగకుండ నొకరు నిగురుకప్పిన నిప్పుమల్లె పత్రాలచాటున పరిమళించే లతాంతంలాగు, మొగులుపూతలో ముసుగువడ్డ నెలవంకవలె, రూపసులయ్యునూ దురదృష్టవంతులగుటచే, యీ తుచ్ఛప్రపంచమందు నజ్ఞాతవాసముచేస్తూవచ్చినవారు. రూపసంపదనుబట్టి భావిసంపదను సూచించు దైవజ్ఞులకు సహానిరాశ జనింపజేసెడి జీవితచరిత్రకలవారు. వారిమబ్బులు తొలుగుట ఎన్నటికో! నూతన కళావైభవముతో వారు ప్రకాసించుటది ఎప్పుడో! ఎవరికైననూ శృంఖలాబంధన మతిసుళువుగా జరుగవచ్చును, కాని, అబ్బా, శృంఖలావిచ్ఛేదము కల్గుటమాత్రము కడుదుర్లభముకదా! కాలవాహినులో బుద్బుదప్రాయులు కానివారెవరు?

ఆ అనాధశరణాలయము. తనపూర్వపు టుచ్ఛస్థితిని తన ఉన్నతమైన సింహద్వారముఁజూపి చెప్పుకుని కన్నీరు కా

ర్చుచున్నది; తన ప్రస్తుతదీనావస్థను తన శిథిలమైన, నాచుప ట్టిన, చెదలువెట్టిన గోడలనూ, మద్దికలప దూలములనూ చూపి చూపి విలపించుచున్నది. భారతదేశముయొక్క పూర్వ ప్రస్తుత గాథలివియని చెప్పి చెప్పి వెక్కి వెక్కి ఏడ్చుచున్నది, భారతీయుల నేడ్పించుచున్నది. ఒకానొకప్పు డచ్చోటనే జీవ కళలుట్టిపడు అనాథలు కాపురముచేసెడివారు. ఇప్పుడాచోట నే పిశాచములు సంచారముచేయుచున్నవి. గూబలు, గబ్బిల ములు క్రీడలఁజేయుచున్నవి. ఆచోటనే ఒకానొకప్పుడు, ఏ నాటికైననూ యీ జీవయాత్రయందు సరియైన బాటననుసరిం చి గమ్యస్థానము చేరవచ్చుననెడి ఆశకు తావుండెడిది; ఇప్పు డు ఆ ఆశకుకూడా ఆనేలయే శ్మశానవాటికయైనది. మిగిలిన వారు ఏ అయిదారుగురో దిక్కుమాలిన పక్షులు. అందు ఆమె యు నాతడును మనకు గోచరమయ్యేజీవులు; కొఱతవారు జీవ చ్ఛవములు. వీరిప్రాణము లాగ్రామమందలి భాగ్యవంతుల పి డికిళ్లలో చిక్కువడియున్నవి. వారి పిడికిలి దానముచేసెడి, ధ ర్మముచేసెడి పిడికిలైనచో ఆనాటవారికి పస్తులేదు. ఆ పిడికిలి యే లోభమనే ఇనుపసీలలతో బిగించుకపోయినచో వారికా నాటనేకాదు. ఏ నాటనూ, నిరాధారమే, నిరాహారమే. ఆ దురదృష్టవంతులను కరుణించెడివారులేరు, “వారి కర్మఫలము పకు ప్రాయశ్చిత్తమిది” యనెడి వారేకాని ప్రపంచములో జీ వకోటికి పరస్పరసంబంధ మున్నదని గ్రహించు మహాత్ములేరి యీదుష్టదినములలో? భగవంతుడునూ తనకరుణను, తనద యామయత్వమును, లంచగొండిలకునూ, బూటకములాడువారి

కీసీ వికర్షయించి యుండనోపు. లేకున్న, తాను భాగ్యమును భాగ్యవంతులకే ఇచ్చుచుండుటకు హేతువేమి? "వారిపాపము పండించుటకే" యని యనెదరు కొందరు వేదాంతులు. ఎవరుచూడవచ్చిరి దానిని- వేలకొలదిగా మైళ్లు ప్రయాణముచేసి ఒకవిగ్రహమున కని వేలువెచ్చించి హారతినిత్తుమనియెడి పుణ్యాశీలురకు, తమచేతిప్రక్కను నిలుచున్న అంగవిహీనుడైన బిచ్చగాడు కనులకు కానరాడదేలకో! వారికి జ్ఞానచక్షువు శూన్యమేమో? ఇట్టివారి దయాధర్మభిక్షుకుపాలైన నికృష్టజీవుల దౌర్భాగ్యమేమని చెప్పగలము?

మహనీయులయ్యునూ ఎందరో మానవులు వారిదౌర్భాగ్యమువలనను, వారుజన్మించిన జన్మభూమియొక్క దౌర్భాగ్యమువలననూ, మారుమూలల మణిగిపోయి, పేరుప్రతిష్టలులేక, తమమహనీయతను లోకమునకు వెల్లడిచేయకనే మడియుట మనకి వింతకాదు. బూజుపట్టిన మూలమూలలలో దైవసమానులైన వారెందరో మరుగువడియుండుట వాస్తవమని ఒకమహాకవి వ్రాసియున్నాడు. అట్టివారిని చేరువారిలో పైనచెప్పబడిన అనాధశరణాలయమందలి యువతియు నువకుడునై యున్నారు. పుట్టువుచే బిక్షుకులయ్యూ, వృత్తిచే తిరిపెమెత్తుకొను వారలయ్యు, తలిదండ్రుల బిచ్చపుజోలికి వారేవారసులయ్యు, యోగ్యతచేత మాత్రమూ ఇరువురును, మహదైశ్వర్య కుటుంబములలో జన్మించిన పసద్గుణశీలునకునూ తీసికట్టుకారు. ఆ యువకుడు మరిం మూ నుతింపదగిన గుణసంపదకలవాడు. విశాలహృ

దయుడును, గంభీరభావములు గలవాడును, అయిన కారణము న ఆత్మపరిశుద్ధిగలవాడై తనకుఁ బుట్టువునాదిగా దాపురించిన కష్టపరంపరలను, సంకటములను, జీవితమందలి తుపానులను నిర్లక్ష్యముచేసి, చిద్విలాసిమై, నిత్యమునూ ఆనందముగా కాలము వెడలిబుచ్చుచున్న మేధావి. భగవంతుడాతనిపట్ల, గరుణ వహించి పిల్లనగ్రోవి నూదు నిపుణతను ప్రసాదించినాడు. ఆ కారణమున నాత్మయందలి సుస్వరమునూ, శ్వాసయందలి సుస్వరమునూ మేళవించి తాను యీాలవేయు గానామృతమే అతనికి శరణ్యమై పవిత్రునిగాచేసి చిదానందునిగా నొనర్చినది. ఆతని కర్మ పవిత్రకర్మ. ప్రేమపవిత్రమైనది. దానవాత్మ పవిత్రమైనది. అట్టివానికీలోకమున విషాదమెక్కడిది? దురాశఎక్కడిది? లేనికారణముననే తననికృష్టజీవితముననూ సహధీరుడై కష్టభాజనముగా తలంపడు. ముష్టికనిపోయి, తెచ్చిన నాలుగుగింజలునూ తనవారితో పంచుకుని భుజించెడివాడు; లేనినాడు నలుగురితోబాటు ఉపవాసముచేసెడివాడేకాని భగవంతునైన మెంచి ఫిర్యాదుచేసినవాడుకాడు.

శరణాలయపు వరాండాయందు నొకమూలలో యువతి కాపురము. పిన్ననాటినుండియూ విచారగ్రస్థఅయిన కారణమున నామెముఖమందు వివర్ణమే హెచ్చుగా కానసగును; అందునూ అందము, ఆనందమూ గోచరింపుచునే యుండును. స్త్రీస్వభావమైన బేలతనమునకునూ సిగ్గుకునూ ఆమె పుట్టినిల్లు. ఆకారణమున నామెకితరులతో నెట్టి సంపర్కమూలేక,

ఒంటరితనాన నాచావడియందే ఒకచుక్కవలె అంటిపెట్టుకుని యుండెడిది. ఆమె నేత్రసంచలనమువలననూ, చూడ్కులవిసరువలననూ ఆమె ఉన్నతమైన భావసౌధములో విహరించుచున్నట్లు గానవచ్చును. ఆభావములో నంతలో విషాదము, అంతలో ఆహ్లాదమునూ సూచించుచుండును. అప్పుడే యంకురించుచున్న యౌవనమగుటచేగాబోలు నామె చేష్టలలో స్థైర్యము లోపించినట్లుండును. పేదరాలగుటచే నామె యర్ధవస్త్రయై యుండిన కారణమున నామె పగటిపూట తరచుగా నన్యులకు కనపడదు. ఎప్పుడు బిచ్చమెత్తుకునివచ్చి వండితినునో ఎవరికినీ తెలియదు.

చలికాలములో నొకరాత్రి, మింటనున్న నక్షత్రముల శీతకాంతియే వారికి వెన్నెలప్రాయమై యున్నప్పుడు, యువకుడు తనపిల్లనగ్రోవితీసి మధురాతిమధురమైన పదాలని పాడుచుండెను. ఆప్రదేశమందు రాజ్యమేలుచున్న నిశ్శబ్దంలో వాటి మధురవీచికలు దూరముగా పరుండియున్న యువతికర్ణములదాక్కొని, యామె హృదయములోనికి దారిజేసుకుని అచ్చోకలవరపెట్టినవి. ఆకలహపాటునకు వీగిపోయినదామె ఆర్ద్రహృదయము. ఆమెభరింపరాని ఆనందము ననుభవించి, ఆకాశమందు, తన భావిజీవితము వింతగా పరిఢవిల్లుచున్నట్లు కనుగొన్నది. ఆక్షణమే యామె ముగ్ధాతిముగ్ధయై, ఏకదీక్షగా నాపాట వినివిని అమృతము త్రావినదానివలె మత్తుపడి, తన హృదయనాడితీగలు సాగగా మృదుమధురకంఠస్వరములో పా

డినపాట పాడకయే తానునూ పాడిపాడి ఆయాశపడి నిద్రిజెం దినది. ఆమె కంఠస్వరము సన్ననిదైనకారణమున దానిశబ్దము ఆవరణయందే మణగిపోయినది. యీవిధముగా దినదినమూ నామె పిల్లనగ్రోవినుండి వచ్చెడిపాటల వినివిని, ఆపాటల పాడువారెవ్వరైనదియూ జూడ కుతూహలముజనింపగా, నొకరాత్రిసమయాన నొంటరిదై, గాఢాంధకారమనిదైన వెరువక పాటవినవచ్చు త్రోవననుసరించి పోయినది. ఇదేసమయమునికా చోలు శీతలవాయువు తనివితీర నామె నాలింగనము జేసికొని తృప్తిపడినది. దానికిని భీతిల్లిక, ఆమెయు, ఎవరోపిలచినట్లు ఎవరోతనను ఆకర్షించునట్లు పోయిపోయి అర్ధరాత్రియనెడి విషయమునుమరచి, యువకుడుండిన ప్రదేశముజేరి యాతని చీకటిలోచూడలేక, అతడు తనను చూచునేమోనని భీతిచే గోడలనంటిపెట్టి నతనికి వెనుకతట్టున గోప్యముగా నించునియున్నది. యువకుడునూ, అన్యులుండిరనియెడి భావమేలేకతనగాన సమాధిలో తన్మయుడై, పిల్లనగ్రోవిని హాయిగా నూదుచున్నాడు. పరవశయైనది యువతి. కనులారగాంచినదాతని; అతని అందమునకు నచ్చెరువడినది. రూపసియయ్యునూ తన యందమునూ, తన దీనస్థితిని మరచిపోయినది. అదే తన తొలిచూపు; తొలిచూపునందే ఆమె తన సర్వమునాతనికి ఆత్మార్పణముచేసినది; ఆ సుముహూర్తమునే నామె యాతని వరించినది. అతడింకనూ పాడుచునేయున్నాడు. పాడినచరణములే వేయికళలతో పాడుచున్నాడు. యువతి చేష్టలు దక్కినిలుచున్నది. ఆమె హృదయము బరువెక్కినది. ఆనందబాష్పములు వెల్లువలైపా

ఁ యామె వక్షస్థలమును తడిపినవి. యీలోకములో తనయొంటిపాటు తనమును గుర్తెరిగి, మానసము వేరుసహాయము నర్థించుట గ్రహించి, ఒక్కసారి, తనదుస్థితి పటాపంచలైపోవునట్లు, తనహృదయతరంగములలో సంతోషవీచికలు నిలకడలయివుండునట్లు ఆయువకుని తనవాసిగాజేసుకుని, పరస్పరమూ ప్రేమామృతము పాల్గొనుచూ, పస్తుపడియైననూసరే కాలము వెడలబుచ్చవచ్చుననెడి వాంఛ పొడనూపినదామెకు. తనకుతాను లొంగిపోయి, యువకునిదరిజేరి మెల్లగా "అయ్యా" అని మృదువుగా పిలచినది. అది స్త్రీకంఠముగా గుర్తెరిగి, కొంచెము గగుర్పాటుతో "ఎవరది" యని మారుబల్కినాడాయువకుడు. పరపురుషునితో నామాదిరి ప్రసంగించుట యదే తొలిసారియైనందున సిగ్గుననూ భయముననూ కొంతనివ్వెరపాటుదోపనామెయు భీతచిత్తయై ఆచోటువీడి తన చావడికి బోయినది. ఆరాత్రియంతయు యువకునకు నిద్దురలేదు. తనను పల్కరించినవనిత ఎవ్వరైనదియూ తెలియకుతూహలము మెండయ్యెను. దానిలో మిశ్రితమైనదొకవింత ఆనందము; దానఁజేసి యాతడు స్థిరచిత్తుడు కాలేకపోయినాడు. యువతియూ నిట్టియవస్థకే పాల్పడి మరునాడు రాత్రివరకూ నాత్రముతో వేచియుండినది. మరునాడు మరల యువకుడు తనవెదురు పిల్లనగ్రోవినితీసి క్రొత్త క్రొత్త పాటలను పాడినాడు. వెంటనే యువతి యొడలువిరచుకుని తన చిన్న వలువసవరించుకునిలేని ధైర్యముతో నాతని సమీపించి "అయ్యా, మరల నాపాటనే యీలవేయుము, నిన్ను వేడుకొందున"ని ప్రార్థించినది. అతడును తనసంతోష

మును వెలిబుచ్చక గంభీరముగా "నీవెవరవు" అని ప్రశ్నించి నాడు.

యువతి:—నేను నీవలెనే యీభవనమునందు కాపురము చేయుచున్నాను.

యువకుడు:—అట్లైన నీవు నాయెదురుగ కూర్చుండుము. పాడెదను.

యువతి:—(హీనస్వరముతో) అయ్యా, నేను ఇచ్చటనే నిలుచుండెదను. నేను అర్ధవస్త్రమునే ధరించియున్నాను, మిక్కిలి పేదరాలను.

యువకుడు:—(విచారముతో) అయ్యో, అట్లనా. నా యవస్థయు నట్టిదే. కాని, నీవు అర్ధవస్త్రవైననేమి? నేను అంధుడను. నిన్నుజూచెడి భాగ్యము నాకులేదు.

ఈ పలుకులు వినుటతోడనే పిడుగుపడినట్లుగా నిశ్చేష్టయైనది యువతి, అంతటిరూపవంతునకీయంధత్వ మెట్లుదాపురించినదని. తాను సృజించిన యీ మూర్తివంతమున కిడరాని కళంకము నిడిన బ్రహ్మనుపడదిట్టినది, ఎంతయు విచారించినది, విలపించినది. కాని అతనిపై తనప్రేమమాత్రము లేశమునూ తరుగలేదు. ఆమె ప్రేమించినది యీతని పవిత్రయాత్మనేకాని, శరీరమునుకాదు.

యువకుడు:—ఏమి అట్లూరకుంటివి? పోయితివా?

యువతి:—"లేదు. వచ్చుచున్నాను" ఆమె యాతని సమీపించి కూచునియున్నది. మిక్కిలి ఉత్సాహముతో ప్రేమగీతికలను మేలైనఉద్రేకముతో పాడినాడాతడు. ఆ ఉద్రేకము నామెయూ ననుభవించి సంతోషస్వాంతయై, యాతని శెలవుగైకొని తన నివాసమునకు పోయినది. ఇట్లు కొన్ని దినములు జరిగినపిమ్మట, వారిరువురు స్నేహితులై మెలగుచున్న రోజులలో, నొకరోజున, ఆమె ఆనందమే సుముహూర్తమును సూచించెనా యనునట్లు, యువకు నుద్దేసించి యీామె, "అయ్యా, మనముకలసి జీవించుదమా" అన్నది.

యువకుడు:—ఎట్లు?

ఈ సమాధానమామె యూహింపని కారణమున కొంచెము చిన్నబోయి, సముద్రమువలె భ్రహ్మాండమైన తన పవిత్ర ప్రేమను ఊతగైకుని, ధైర్యమువహించి, "అయ్యా! మన మిర్వురమూ అనాధులము. పూర్వజన్మ సుకృతాన మనకు స్నేహముకల్గినది. అది ప్రేమగా పరిణమించి, మనకనుకూలముగా నుండునట్లు గోరుచున్నాను. నేను అబలను, నీవంధుడవు. నీకు నేనునూ, నాకు నీవునూ సహాయులమై జీవయాత్రఁజేయుదము.

యువకుడు:—వీలులేదు. స్త్రీ చపలచిత్త. నేనో, అంధుడను. మనకు సౌఖ్యముగలుగదు.

యువతి:—అయ్యా, స్త్రీ చపలచిత్తయని నిరసించుట తగవుకాదు. నా పవిత్రత నెరిగి నిన్నునేఁ బ్రేమించునట్లే నన్ను

నూ నీవు ప్రేమింపుము. నీవంధుడవైన మాత్రాన నావలన నీకెట్టిదోసగునూ జరుగనియ్యను.

యువకుడు:—మనది మోహముతోఁ గూడిన వలపే మోయని సంశయముగా నున్నది. అది చిరకాలముండునది కాదు.

యువతి:—అట్టి సంశయమువలదు. భగవంతునిసాక్షిగా నిన్ను నేను మనసార ప్రేమించుచున్నాను. నిన్నె నేను తొలిసారి చూచినది; అదే ప్రేమయై పరిణమించుచున్నది. వలచి వచ్చిన స్త్రీయని చులకనఁజేయవలదు. నీకు సేవలజేతును, సుఖమునిత్తును.

యువకుడు:—సంసారము దుఃఖమయము; ఇది తెలిసి మన మేల యందుజొరవలయును?

యువతి:—ఇరువురు పవిత్రహృదయులచే నడుపబడిన సంసారము దుఃఖభాజనము కాదని నేఁదలంతును.

యువకుడు:—నాతో నీవునూ బిచ్చమెత్త నలసిన దుర్గతిపట్టును.

యువతి:— నాకు చిరకాలమునుండియు నది యలవాటైయున్నది. నీయండనుండి యెట్టిదుర్ఘటమైన పనినైననూ అవలీలగా జేతును.

యువకుడు:—ప్రపంచమంతయు నజ్ఞానమయమై యంధకారబంధురమై యున్నది. దానికితోడు నాకు సూర్యచంద్రులానాడే లేరైరి. ఇట్టిపరిస్థితులలో నాస్థితి నీకు దుర్భరముగానుండునని భీతిగాయున్నది.

యువతి:—అట్టి భీతివలదు. మన పవిత్రప్రేమయే మనలం గాపాడుచుండును.

యువకుడు:—నీవునూ నాతో పస్తుపడవలసియుండును. అది నాయభ్యాసమైనది. నేను గడింపసశక్తుడను.

యువతి:—నీతో ననుభవించెడిపస్తు నాకు విందుగానే యుండును.

యువకుడు:—పిల్లా! నేను నిన్ను నిశ్చయముగా ప్రేమించుచున్నాను. నీమనోనిశ్చయము నెరుగదలచి నిన్నింతగా శ్రమపెట్టితిని.

యువతి:—అయ్యా, నేను అదృష్టవంతురాలను. భగవంతునిపై భారమువైచి మనము జీవించెదము.

త్వరలో వారు భార్యాభర్తలైరి. వారి వివాహము నిరాడంబరముగా జరిగినది; విందులులేవు, భజంత్రీలు అంతకన్నా లేవు. ఆ సుముహూర్తాన గుడిలోనిగంట విజయధ్వనిని మ్రోగి వారినాశీర్వదించినది.

వారిరువురు నొకేమారుగా "మనము ధన్యులము; భగవంతుడు మనవివాహమునకు వేంచేసి యాశీర్వదించినాడు" యనుచు నాతనిస్తుతిజేయు పాటలంబాడికొని సుఖముగనుండిరి.



Printed at the S. S. M. Press, Vizagapatam.